# ఈనాటకము నందు వచ్చు పాత్రల వివరము

---

పురుషులు—

సూత్రధారి
చిరుతొండరాజు
మంత్రి
సిరియాళుడు
మహేశ్వరులు
పరమేశ్వరుడు
నందికేశ్వరుడు

స్త్రీలు—

నటి
సుగ్గులాదేవి
చెలికత్తె
పార్వతి
ఆకాశవాణి

---

# హెచ్చరిక



ఇట్లు
కొండా శంకరయ్య
పుస్తకముల వ్యాపారము, మహాకాళివీధి
సికింద్రాబాద్.

శ్రీరస్తు.
శ్రీశివాయ నమః
శ్రీరాములు సీవేశేళావు.



# చిరుతొండ నాటకము

పాిరంభము.

శ్లో॥ జ్ఞానంద మయం దేవం । నిర్మల స్ఫటికాకృతిం
ఆధారం సర్వవిద్యానాం । హయగ్రీవ ముపాస్మహే ॥

క॥ శ్రీజైవాతృక శేఖర ♦ రాజీవ భవాండకోటి రమణ మహోగ్ర
భ్రాజిత విగ్రహ మహాదే । వాజాగీర్ కూర్ణపల్లి వాసమహేశా ॥

శా॥ సుశ్రేయంబుగ మత్కవిత్వమును సంశోభించి సిద్ధింపభ
క్తి శ్రద్ధాను సమన్వితుండనయి నే గీర్తించి పూజించెదన్
శ్రీశ్రీ కంఠుని పద్మనాభుని విరించిన్ బార్వతిన్ శ్రీనివి
ద్యశ్రేణీ యాధిదేవతన్ గరిముఖున్ నాచార్య వర్యోత్తమున్ ॥

క॥ మరియుం దలి దండ్రులపద । సరసీరుహములకు నెరిగి సద్భక్తిమెయిన్
స్థిరమతి భజియించెద నే।వరుసతో మరిసంస్కృతాంధ్రవరసత్కవులన్॥

వ॥ ఇట్లు యిష్టదేవతాభి వందనంబును గురుజననీ జనక నమస్కా
రంబును సుకవి స్తోత్రంబునుం గావించి శ్రీ మజ్జాగీరు కూర్ణపల్లి నివాసుం
డగు మహాదేవ స్వామ్యంకితంబుగా నా యొనర్పం బూనిన శ్రీబసవ
పురాణోక్తంబును భుక్తి ముక్తి ప్రదాయకంబును నగు చిరుతొండ మహా
రాజు నాటకంబునకు గథా సంవిధానం బెట్టిదనిన.

సూత్రధారి ప్రవేశించి సభవంక చూచి ( తనలో )

వ॥ భళీ బ్రహ్మానందంబగు యీ సభా భవనంబునుం జూడ నామది
కాహ్లాదంబగు చున్నది. సరి యింద రొండ కొరకు కిందు గుమిగూడి యుంజ

వచ్చును యోచించి చూచెద గాక (అని యోచించి చూచి) ఆ గ్రామస్థులైనవి యేదో యొక పుణ్యకథ విని కృతార్థుల మగుదు మని యపేక్షించి విచ్చేసి యున్నట్లున్నది సరి వీరి హృదయారవిందంబు లానందింప జేయుటకై మత్ప్రియసీ రత్నంబగు నటిని రావించి యొక్క సత్కథా ప్రారంభించెద గాక (అని తెరవంక చూచి)

వాదము - యేక.

సూ॥ సుందర మగు నటి యిటురావే - యిందు నామనవి నాలకించవే॥
సుం॥ అందముగను సభ యందుండెల జను - లందరి మనసానందము జేయగ ॥ సుంద ॥

వ॥ యీ సభా సదుల మనంబులు రంజింపం జేయ నటీ నీవొక సారి యిటురమ్మా.

నటి ప్రవేశించి

వ॥ నాథా అభివాదనము.

సూత్రధారి

వ॥ నారీ శుభంబగు గాక.

నటి॥ సుందర విగ్రహా నానాథా - సూరి జనోత్తమ గుణయూథా ॥ సుంద ॥ యెందు కొరకు నన్నిందు బిలిచితిరో - పొందుగ నాకది యిం దెలుపుడి యిక ॥ సుంద ॥

వ॥ నాథా నన్నిప్పటి కాహ్వానము మానం బొనర్చిన విధానం బేమో నిదానంబుగ వినరించుడు మత్కర్ణా నందంబుగ విని సంతోషించెదను.

సూ॥ కథవని భామిరో యిటుజూడూ - సభ వారందరి నికనే డూ ॥ కథ ॥ విధవముగను నిటవిచ్చేసిరి వీ - రభిమతములు దీర్పవలెగా మనమిక ॥ కథ ॥

వ॥ ప్రేయసీ యిట్టి సభా సదులు పుణ్యాత్ములగు పూర్వుల చరిత్రంబులు విని ధన్యుల మగుదు మని వాంఛించి వేంచేసి యున్నవారు కావున వీరి యభిమతార్థంబులుం దీర యేకో యొకపుణ్య కథ వినిపించుటకై నిన్నిందు రావించితి.

నటి॥ శుభమాయెను మీదువాక్కులన్ - సూచనముగ విన్న వీను లన్ ॥ శుభ ॥ రథసముగను సద్రసికత్వ కథన్ - విభజించియు మీర్వీను పుడి ముదమున ॥ శుభ ॥

వ॥ నాథా యే కథా సారంబు వలన వీరి హృదయ కంజంబు లానందించునో యోచించి కథా ప్రారంభించుడు సంశయించెద రెందుకు.

సూ॥ మంచి దట్టులైనను వినుమూ - మరివాక్రుచ్చెదతికథనమూ॥ మంచి॥ యెంచగ చిరుతొండేలికథవిని - పించిన వీరికి ప్రియమొదవును గద ॥ మంచి ॥

వ॥ సుందరీ చిరుతొండ మహారాజు చరిత్రంబను నొక పుణ్యకథ గలదు అది నవీనముగా కృతి జేయింపబడి యున్నది యది వినిపించిన వీరల మనంబులు సంతసిల్లునుగదా.

నటి॥ కాంచనాంగ యట్టులె వీరి - కర్ణానందంబుగ భూరి ॥కాం॥ అంచితముగ కూర్ణపల్లి శివునిభ - జించి యక్కథనె జెప్పుడు వీరికి ॥కాం॥

వ॥ నాథా యచ్చిరుతొండ మహారాజు చరిత్రమే ప్రారంభిం చుడు కాని అట్టి సద్గ్రంథ మెవ్వరు రచించిరి రచించుమనివచించిరెవ్వరు వారివారి యభిధానంబులు శుభంబలర శృతపరచి మచ్ఛ్రుతిపుటంబు లానందింప జేయుడు.

సూత్ర వ॥ మంచిది ఆలాగే విన్నవించెద నిటువినుము.

## సీసమాలిక.

శ్రీనిజామాబాదు జిల్లలో వెలసిన - బోధను తాలూక భూమి యందు - గొప్పైన జాగీరు కూర్ణపల్లినివాసు డైనట్టి సుగుణప్ర ధానుడైన - ధాత్రికమండలగోత్ర సంజాతుండు దండు వంశాబ్ధి చంద్రుండు ఘనుడు - రంగగౌడతని ప్రియాంగన చంద్రమ్మ వారిద్దరికి పుట్టి వసుధ లోన - కీర్తి వహించి సద్వర్తను డై వెలయు నాసగౌడు వివేకసరసమతుడు- ధరలోన సప్త సంతానంబులలో ముఖ్య సంతానమే కృతి సంతతియని - మదినెంచి కథలప్రోల్ మందిరుడైనట్టి గంగాధరాఖ్య సత్కవిని బిలచి - మేటి చిరుతొండ మహారాజు నాటకంబు - రచన జేయించె నవనిపై రసికులెన్న - అట్టి సత్పుణ్య మతుని చేపట్టి బోచు - దివ్యసంపద లిచ్చి మహాదేవుడెపుడు ॥

వ॥ సత్రిమ్మాజీ బ్రోటీపా యిద్దకారలంగంబన పేరు వహించిన బోధను ఖాలానాలోనుండబడు జాగీర్ కర్ణాకల్లి నివాసుండును దండు రంగ గాడు తెల్యాశ్త్రి చంద్రోగ్ర యాణ్యార్ద్ర ప్రియకుమారుండునునగు నరస గాడు కీర్తిద్రవ్యంబున కష్టించి సత్పసంతానములలో గృతిసంతానమే ముఖ్యంబని భావించి కదలాపురి గంగాధరాఖ్య కవి వర్యుని రావించి సత్కరించి సకల బహుమానములొసంగి యిట్టి చింతతొండ నాటకము కృతి చేయించి జగత్ప్రసిద్ధి వహించి యుండెనుగదా.

నటి-వ॥ ఆహాహా మనోహరా అట్టి పుణ్యాత్ము నెల్లకాలంబా శ్రీమన్మహాదేవుండు సకలైశ్వర్య సంపదలొసంగి పుత్ర పౌత్రాభివృద్ధిగా రక్షించుచుండును గాని తదుపరి విచారమేమో గు(స్త)రించక ప్రస్తుతము విస్తరింపుడు మదీయ కర్ణానందంబుగా వినియెదను.

సూత్రధారి-వ॥ సరియంచిది మనోహరీ మనమిప్పుడీ కాలంబున యీవసంత ఋతుమహిమాభి వర్ణనం బొనరింపుచు హాయిగా యీపూదోటలో విహరించ వలెనని బుద్ధికదా ముద్దియ.

నటి-వ॥ నాథా నాకైన నదియే కోరిక అట్టులనే గావింతము సందేహమేమి.

వాదము - యేక.

సూ॥ ఆహా కనుంగొను మబలా - యీమహిని సుమసంతమహి మేమనదగు ॥ఆహా॥ మహీరుహంబుల మహాత్మ్యంబుగ విహితముగను జూడకనుల - విందొనర్చు నేడుమనల ॥ఆహా॥

వ॥ సుందరీ యీమల్లె మొల్ల సంపెనాది తరుచ్ఛాయల విలాసంబులుం జూడుము యెంత మనోహరంబుగా నున్నవి యీ పొదరిండ్లలో విహరించిన విరహుల పరమోత్సాహం బెంతనవచ్చును.

నటి॥ మహాత్మ సుగుణవిచారా - యిమ్మహారణ్య మహిమంబున గణ్యము ॥మహా॥ మహాన దముగ మయూర శుకపిక - విహంగతండ రవములెంతో - విస్తరిల్లె మదికి నెంతో ॥మహా॥

వ॥ నాథా యీశుకపిక మయూరాది విహంగ ధ్వానంబులకు నామనంబెంతో సంతోషించెనుగదా.

సూ॥ సరే మంచి దటుచూడు - యీ సరోవరంబుల సాహసూర్య
ముసు ॥ సరే ॥ మరికా పూలపై మధురామృతమును - సరసముగను
గ్రోలిభృంగ - సమితినొప్పి మదిచెలంగ ॥ సరే ॥

వ॥ తరుణీ యక్కమలా కరంబునం గల కమలామృతంబు నుం
ద్రావి యబ్భ్రమర సంఘంబు లెంతో యమితోత్సాహంబున ఝుంకార
రవంబు లిచ్చుచు హుంకరించు చున్నవో చూడుము.

నటి॥ ధరణి వెలయు కూర్ణపురి - శంకరుని మహిని సంస్మరింపు
చును యిూ ॥ ధరణి ॥ నిరంతరము సుఖ నిలయంబగు యిూ - వర వసిం
జరించి సౌఖ్య - పరత సుందమిందు ముఖ్య ॥ ధరణి ॥

వ॥ నాథా మన మనోరథంబులుం దీర యిూ పూదోటలో
హాయిగా విహరింపుచు ప్రొద్దు బుత్తము రమ్ము.

సూ-వ॥ సరి మంచిది పోవద్దు. ( అని నిష్క్రమింతురు )

కంచీ పురము

చిరుతొండరాజు ప్రవేశము - దర్వు - యేక.

చిరుతొండ మహీశాగ్రణుడా - సుస్థిర సౌఖ్యద సుందర రూపు
డనే ॥ చిరు ॥ పరిపరి విధముల పరిపంథి ధరావరుల నెల్ల గెలచీ - సుఖ
తత్పరుడ నయ్యి నిలచీ - సరసముగను సజ్జన సంఘంబుల - పరి రక్షించెటి
పరమ దయాళుడ ॥ చిరు ॥ నగరోత్సవ శ్రద్ధ యుక్తుడనురా - నే నగణిత
వైభవుడని పొగడొందిన ॥ నగ ॥ జగతిలోన కీర్తి గడించిన భక్తగణ
శ్రేష్ఠుడరా - మితవాక్య గణ గరిష్ఠుడరా - సుగుణ జలధియన పొగడొం
దిన మా - నగరిష్ఠుడ భూతగణ సముండను ॥ చిరు ॥ పూర్ణేందు సమానా
స్యుడరా - శ్రీ కూర్ణపల్లి సద్గృహ మహాదేవుని ॥ పూర్ణేం ॥ నిర్ణయముగ
నమ్మి కొలచి భక్తి పరిపూర్ణుడనై వెలసీ - సద్గుణార్ణ వుడను మెలసీ -
స్వర్ణ సురత్న స్థగిత కిరీటుడ - స్వర్ణ భూషణయుత సార్వరాడ్వైభవుడ ॥ చిరు ॥

వ॥ మంత్రి శేఖరా,

మం-వ॥ కింభో చిరుతొండ మహీపాల.

వాదము - యేక.

చి॥ హో మంత్రివర మనరాజ్యంబున క్షేమ మేకదా ॥ హో మం ॥
ధీమంతులునై శ్రీమంతులునై కామిత ఫలముల గైకొని నిరతము - క్షేమ

లాధ వస్తులయ్యి తమతమ భామ పుత్రమిత్ర బాంధవులతో - క్షేమ మేకదా ॥హోమం॥

వ॥ మంత్రీ మన కాంచీపట్టణంబునంగల చాతుర్వర్ణ్యాదులు నీతి దప్పక పురుషార్థ వైభవంబున పురహరు నాశ్రయించి పుణ్యవంతులై తమతమ పుత్రమిత్ర కళత్రాది బంధువులతో సర్వసౌఖ్యంబు లనుభవిం పుచు సుఖంబున నున్నవార లేకదా.

మం॥ భూమిపాళ చంద్రమ వినుమంతయు క్షేమమేనయా ॥భూ॥ సోమమౌళి కరుణచేత మీరీ భూమి నేలుచుండ సర్వజనములు - యేమి కొదువలేక దారసుత సఖస్తోమములతో సఖులై వెలసియు మహా! - క్షేమ మేనయా ॥భూ॥

వ॥ రాజా మన రాజ్యంబునంగల యావజ్జనంబులు శ్రీసదా శివ ధ్యాన పరాయణులై తమతమ దారా సుతాదులతో సర్వసౌఖ్యంబు లనుభవింపుచు సుఖంబుననే యున్నవారు మహాప్రభో.

చి॥ వేవేగ వేశ్యాంగనామణుల రావిధింపుమా ॥వేవే॥ కేవల ముగ సంగీత నాట్యములు గావింపగ జేసిపండితాళుల రావిధించిసర్వ ధర్మ ములు దెలిపేవిధంబు జేయగ నందరనిట - రావిధింపుమా ॥వేవే॥

వ॥ సచివ పుంగవా సకల సంగీత నాట్యకళా ధురంధరులగు గణి కాంగనల రావించి నృత్య గీతంబులుం గావించి సర్వ పండితోత్తములచే సర్వ శృతి స్మృతి ధర్మంబులుం దెలుపునట్లొనరించి నాడెందం బానం దింప జేయుము.

మం॥ భావింప కూర్మపల్లి నిలయుని భావజారినీ॥భా॥ సావధానముగను నమ్మి మీరను చందమిపుడు జేసినాడ కనుమదో - వావిరిగను కన్నుదోయి కింపుగ వాస్తవముగ నమ్మియున్నవాడను - భావజారినీ ॥భా॥

వ॥ నరవరేణ్యా మీరను చందంబుననే సర్వపండితుల రావించి సర్వ ధర్మంబులుం దెలుపు నట్లొనరించి గణికాంగనలచే గాన నృత్యంబు లుం గావించి యింద్ర వైభవంబుగా జరిపియున్నవాడ యవలోకనుండు.

చిరు-వ॥ సరిమంచిది మంత్రివర్యా ఇటులోకసారి వినుము.

మం-వ॥ ప్రభో యేమి సమాచారము.

వాదము - జుల్వ.

చి॥ వినుమిటు మాత్రీ - నామనమున నొక యోచనయును జని యించెనుగద స్వతంత్రి ॥విను॥ దినదినమును మనకును గలిగిన యాయువు జనుచుండ - కనియుగాన శేకవృథా దినములను గడుపంగనాయె ॥విను॥

వ॥ మంత్రీ దినక్రమంబున మదయాస్తమయంబుల మన కాయువు తగ్గిపోవుచుండ విచార శూన్యులమై తదనుభవంబునుం గానక మాయాంధకారంబునంబడి పొరలుచుంటిమే కాని ముందటి సద్గతి గాననైతిమి ఇది యెంత వెర్రి.

మం॥ మనుజవరేణ్యా - సద్గుణగణ గాంభీర్యవార్ధి వినయ వివేకాగ్రగణ్య ॥మను॥ ఆనయము నీవాడు వాక్యమును నిజమే కానిదు రేమనెదరో విన జేయుడినే వినియెద నా వీనులలర ॥మను॥

వ॥ నరనాయకా నీవనునది నిక్కమే కాని యింకేమందురో చెప్పుడు.

చి॥ పంచభూతముల్ - ద్వయ పంచేంద్రియములును మరియు పంచతన్మాత్రలును ॥పం॥ అంచితముగ జ్ఞానము మరి అంతఃకరణములు నాల్గు - పంచవింశతి తత్వములతో పరికల్పితమయ్యె తనువు ॥పంచ॥

చ॥ అరయగ యీషణత్రయము ♦ నష్టమదంబులు వైరిషట్కముల్
మరివిషయాదులందగిలి ♦ మానవుడుల్ దరిగానలేక సం
సరణ మహాబ్ధిలో బడియు ♦ చాల కృశించి జరించు గాని సు
స్థిరమగు మార్గముంగనడు ♦ చేటుదలంప డిదేమి చోద్యమో ॥

వ॥ కావున పంచవింశతి తత్వంబులతో గూడి యున్న యీకళేబరంబు నాశ్రయించి జీవుండనేక జన్మంబులెత్తి యీషణత్రయంబులం జిక్కి అరిషడ్వర్గంబులం జయింపనేరక విషయాసక్తుండై పుత్ర మిత్ర కళత్రాది గృహాంధకార కూపంబునంబడి దరిగానక పొరలుచుండునే గాని నిజమైన మార్గముం దెలియడు అబ్బా ఇది యెంత అజ్ఞానము.

మం॥ యెంచగ నిలలో భవదంచిత సద్వాక్యములకు నలరెను మోదమును మదిలో ॥యెం॥ పంచశరాంతకుని మాయ పరిహరించ వశమటే వి - రించి ప్రముఖులకు నైన కించిన్నరులనగ నెంత ॥యెంచ॥

వ॥ నరవరేణ్యా బ్రహ్మాదుల కలవిగాని యీశ్వరమాయం జయిం చ నరమాత్రులలో నెమాను యెంత సుజ్ఞాన మలవడుట దుర్లభముగదా.

చి॥ మరి విను వెంకటీ - అస్థిరమగు యీ దేహా మెపుడో యరుగు ను మృత్యున్నరలో పాటి ॥మరి॥ స్థిరమని నమ్మంగరాదు మరిదార సుతాదు లైన - మరలింపగ లేరుతాను దరలిపోవ ప్రాణముతను ॥మరి॥

చ॥ ధనపశుపుత్ర మిత్ర ♦ వనితా గృహ సంపద లెన్నియైన వెం
టను మరిరావు రావొకటి ♦ డాంబిక వేషమె కాని స్వప్నమం
దునపొడ గన్న వస్తువులు ♦ దోచును మేల్కని చూచినంతన
య్యనువున నిట్టి సంసరణ ♦ మానిజ మార్గమె చూడ మేలగున్ ॥

వ॥ మంత్రీ అస్థిరమైన యీ సంసారమున్ నమ్మి చెడుటకన్న నుత్తమ జ్ఞానికి మోక్షమార్గంబు వెదకి కొనుటమే మంచిదిగదా.

మం॥ ధరణిలోపూని - సుందర తరమగు కూర్ణపల్లి ధాముని కృప గలదుగాని ॥ధర॥ నరవర మీరాడునట్టి మరుగువాక్య మదియెట్టిదో - విరివిగ వినిపించుమిందు స్థిరమతి నాలించువాడ ॥ధర॥

వ॥ రాజన్ మీరనుమాట మరుగుగా దోచుచున్నది కావున అదెట్టిదో స్పష్టముగ విన్నవించుము నేవిని రెందను.

చిరు-వ॥ మంచిది మంత్రీ అట్టులనే స్పష్టముగ జెప్పెద నిటువినుము.

సీ॥ ధీమంత వినర యీ దేహంబిలను పంచ ♦ భూతమయంబైన బుర్రకాయ ♦ కడుప్రేమతో దీనికాపాడుదామన్న శతవత్సరంబులు మించి యుగలదు ♦ తలిదండ్రి సతిసుతుల్ ధనధాన్యములమీది ♦ భ్రాంతిచే యీ కాల మంతగడపి ♦ అంత్యమందునను నేయడవినో గిరులందో ♦ నీరమందో లేక నిలయమందో ♦ తనువులోనుండి ప్రాణముల్ తరలు వెనుక ♦ కాటికేగాని కొరగాదు గవ్వకైన ♦ గాన నికముక్తి ఫలితంబు గాంచ గోరి ♦ జంగమార్చన జేయ హెచ్చరిక బోడమె ॥

వ॥ కావున అస్థిరమైన యీ దేహంబును నమ్మి కాలంబు గడవ ముఖ్యంబు గాదు మోక్షంబుగాదు మోక్షంబు సంపాదించుటవే మంచిది ఇందులకై నేను జంగమార్చన జేసెదను దానిచే ముక్తి లభించునుగదా మంత్రీ ఇటువినుము.

వాదము - జల్ప.

చి॥ భక్తారాధనము జేయ వదపడి నామనసు గోరె - భక్తితోనది యాచరించ ముక్తిఫల ప్రదముగదా ॥భ॥

వ॥ మంత్రీ జంగమారాధనచే ముక్తిగలదని నామది దోచుచున్నది కావున నాది జేయ వలయునుగదా.

మం॥ రక్తితో ముసుపెవ్వరైన రారాజులు యిటుజేసిర- వక్తికిగనే నెరుగనైతి వ్యవహార స్థితిలోపల ॥ర॥

వ॥ రాజా ముందెవ్వరైన రారాజులు యీభక్త కైంకర్యంబు జేసియున్నరన నేవినలేదు రాజులేడ పూజలేడ ఇదంతా దుర్భ్రమ.

చిం॥ మంచిది నీమానసమున మరి యేయేవిధముగలదో - అంచితముగ దెల్పర నాలించెద నీవాక్చతురత ॥మంచి॥

వ॥ మంత్రీ అట్లుగాని యెడల నీమనంబున నెట్లున్నదో చెప్పుము నీవిచారము తెలిసికొనియెదను.

మం॥ యెంచగ నొకహానియు గల్పించి మానవులను గొట్టి వంచించి ధనంబుదీసి పంచిపెట్ట నేమి ఫలము ॥యెంచ॥

వ॥ రాజా లేని పోనిదొక హాని కల్పన జేసి మానవులంగొట్టి ధనంబుదీసి జంగమార్చన జేసిన నేమి ఫలంబున్నది గోవులజంపి చెప్పుల దానము జేసినట్లున్నది యీవిచారము.

చా॥ వినరానటువంటిమాట విని పెదవిక చాల్ చాల్ మరి - అనయము యీలాగు జేయ పనియేమిర మనకిప్పుడు ॥విన॥

వ॥ మంత్రీ ఇట్టి దుర్వాక్యంబులు నామెడ బలుకం జెల్లదు యీశ్వరానుగ్రహంబున మనకేమి కొదువున్నది పరుల పీడించనేల మనమీ కార్యంబుం జేయనేల.

మం॥ ధనమెల్లను బంచియు నిర్ధనికుడవై పిదప నీవు - మనియెద వెటు సతిసుతులతో మర్యాదయౌ యీరీతియు ॥ధన॥

వ॥ రాజా అట్లులైన నీకున్న ధనమంతయు బంచిపెట్టి దరిద్రుడవైన పిదప నీదారా సుతాదులతో కాలంబు గడుపుదు వెట్లు ఇదంత నటిభ్రమ.

చి॥ ఇందుకు శంకరుడె గలడు యెందుకు నీమదిలోందర - సుందరి నాసగియును ముక్తి జెందదెమను భక్తాళుడు ॥ఇం॥

వ॥ మంత్రీ ఇందుకోసరమే నీమది తొందరొందుచుంటివా యేమి కానిమ్ము ఆ పైన శంకరుడే కలడు ముందా భళ్ళాణుండు వ్రతంబుబట్టి తన యిల్లాలు నొసంగి కైవల్యంబు నొందియున్నాడని నీ వెరుంగవా ఇందులకై సందేహ మేమియు లేదు నే నీవ్రతంబు మాత్రము సేయక మానను.

మం॥ సుందర మగు కూర్ణపల్లి మందిరు మహాదేవుడేలు - ఇందుకు మారాడ వెరతు ముందేదో యొనర్పుడికను ॥సుంద॥

వ॥ ప్రభో మీకెదురాడ నే నెంతటివాడను మీమదినున్నట్లు జేయుడు మీయాజ్ఞ మెలంగెదను.

చిరు-వ॥ మంత్రీ ఇటువినుము.

మ॥ వినుమోమంత్రి మదీయ వాక్యమిపుడున్ ♦ వేయేల నానామహే
శనికాయంబరుదెంచి యేమడిగినన్ జాగించుకన్ లేక గొ
బ్బున నేనవ్వి యొసంగు పద్ధతిని ♦ నేర్పొప్పన్ దగన్ బూనితిన్
యనుమానంబిపుడేమి లేదు నిజమున్ ♦ వాక్శుద్ధిగన్ బల్కితిన్ ॥

వ॥ మంత్రీ నానేమంబిదిగదా యెవ్వరేని యర్థులేతెంచి యేయే పదార్థంబు లడిగిన యాయా పదార్థంబు లేదనక యిచ్చి వారివారి మనోరథంబులుం దీర్చి బుత్తెంచెదను కావున ఇదియే నావ్రతము.

మం-వ॥ ఆహాహా రాజన్ నీ వితర గుణంబునకేను సంతోషించితిని కాని యెంత వ్రతయాస కాలమొచ్చినను దబ్బరలాడరాదు వ్రతంబు విడువ రాదు ఇందుల కోర్పుతిరేని వ్రతంబు బూనుడు వద్దన నే నెంతటివాడ.

చిరు-వ॥ మంచిది మంత్రీ ఇట్టివార్త మత్సతీల లామయగు సుగ్గులా దేవికి వినిపింపవలయు దాని నొకసారి యిందురావించుము.

మంత్రి-వ॥ చిత్తము ప్రభో అట్టులనే నీప్రియకాంతయగు సుగ్గులా దేవిని రావించెదను ( అని నిష్క్రమింతురు )

సుగ్గులాదేవి ప్రవేశము - దరువు - యేక.

గిరిజా మనోహరా నను బ్రోవ అరుదెంచవేరా - నీవరుదెంచవేరా - నను కనుగొంచుమిరా - గిరిధీరా - సువిచారా ॥గిరి॥ పురవైరిమకరధ్వజ సంహార హేసురమానిస్తోత్రా హేసురమాని స్తోత్రా - సుందర శ్వేతగాత్రా - హరిమిత్రా - సుచరిత్రా ॥గిరి॥ ముని బాలు నేలిన వాడ

వని నే నిను నమ్మియుంటీ - నేనిను నమ్మియుంటీ - నన్నునుబ్రోవుమంటీ- నినుగంటీ - ముక్కంటీ ॥గిరి॥ ధగవెలయు శ్రీకూర్ణపల్లి నిలయా పరమాత్మ వినయా - హేపరమాత్మ వినయా - పెన్నురగేంద్ర వలయా - పరమ దయాకర హృదయా ॥గిరి॥

ప॥ చెలీ భ్రమర కుంతలీ.

చెలి-వ॥ అమ్మా సుగ్గులాదేవి యేమి సమాచారము.

వాదము - యేక.

సు॥ వనితరో నేడేలకో నావల్లభుడు రాడీ యాస్థితినీ - వినక నా మది తల్లడిల్లెను వినుపగ దెప్పూనీ - యాస్థితినీ ॥వని॥

వ॥ నెచ్చెలీ దిన దినంబున నిక్కాలంబునకే నామనోహరుండు వచ్చు వాడు నేడ దేలకో రాక నాలసించి యున్న కారణం బేమో నీకుం దెలిసి యున్న నేర్పరించుము.

చె॥ వనజ ముఖి నీవల్లభుడు సభ జనములతో నేడూ - యీ నాడూ - అనువుగను నొక కార్యమును జేయను దలంచినడూ - యీ నాడు ॥ వన ॥

వ॥ అమ్మా సుగ్గులాదేవి నీమనోహరుండగు చిరుతొండ మహ రాజు సభా సదులం గూడికొని యేదో యొక గొప్ప కార్యంబుం జేయ సమకట్టి యున్నట్టుగానే వినం బడితి వినంగ వలతువేని విన్న వించెదను.

సు॥ పొంగి యాకార్యమును యేదో వినంగ నాకిలనూ - నీవిక నూ - అంగుగను శృత పరచు విని యెద నధిపు కార్యమునూ - నీవి కనూ ॥ పొంగి ॥

వ॥ తరుణీ మన్నాధుం డొనర్పం బూనిన యా గొప్ప కార్యంబెట్టి దో చెప్పుము నే విని సంతోషించెదను.

చె॥ జంగమార్చన జేయగను మది పొంగె నీవిభుడూ - యీ నాడు - జంగమము లేమడిగి నను నియ్యంగ దలచినడూ - యీనాడు ॥ జంగ ॥

వ॥ అమ్మా నీమనోహరుండా జంగ మారాధనంబుం జేసి భక్త లేమడిగిన నది యిచ్చెద నని ధర్మ కంకణంబు గట్టి యున్నవాడట అబ్బా

అట్టి గొప్ప కార్యంబు నిర్విఘ్నంబుగ జరుగు నెట్లో కాని తెలియదు యీశ్వర కటాక్షించెట్లు యున్నదో.

సు॥ యెందరో యిలాంటి పనులను ముందు జేసియున్నా - బహుగనూ - యెందరే శ్రమలుక్ పరీక్షలు సిద్ధమా నిలనూ - బహుగనూ ॥యెందరో॥

వ॥ సుందరీ ముందెందరో రాజులు యిలాంటి పనులుం జేసి యెన్నో శ్రమ లనుభవించి నారన వి దురు అది యటుండగాక ఇట్టి కార్యంబుల యందెన్నో పరీక్షలు జరుగును అన్ని పరీక్షల కోర్చి యీ వ్రతంబు నిల్పుటకు నా వల్లభుం డౌనో లేదో కదా.

చె॥ తొండరెండను కూర్ణపల్లి సుమందిరుడె గలడూ యీనాడు - ఇందుముఖి యీవార్త స్పష్టముగం దెలియ మిపుడూ యీనాడూ ॥

వ॥ అమ్మా ఇందుకొరకే గావచ్చును నిన్ను నీవల్లభుండు రమ్మని యాజ్ఞాపించెనట కావున అచ్చటికిం బోయి యావద్వృత్తాంతముం దెలిసికొమ్ము తొండరొదుకు.

సుగ్గు-వ॥ మంచిది అట్టులనే తెలిసికొని యెదను (అని భర్తాకునిం జేరి) మనోహరా భవచ్చరణార విందంబుల కిదో నేను ప్రియురాలగు సుగ్గులా దేవి నమస్కరించుచున్నది కటాక్షించుడు.

చిరు వ॥ మనోహరీ శుభంబగు గాక.

వాదము - రూపకము.

సు॥ జననాయక నను బిలచిన పని యేదో యదినిజముగ ॥జన॥ విన జేయుడి విని యెదనా - మనమున సంతోషించియు మత్కర్ణ ద్వయములవో ॥జన॥

వ॥ నాథా నన్నిచ్చటికి రావించిన కారణంబేమో నట్టుంబెట్టక స్పష్టముగ విన్నవించుము - రెండు చెవుల విని సంతోషించెదను॥

చి॥ వనజాక్షిరో వినగదె యావార్త నిజంబుగ దెలిపెద ॥ వన ॥ మునుకొని నేనొక్క కార్య - మును జేయ దలంచియు నిన్నును రావించితి నిచటికి ॥వ॥

మ॥ అతివా నేనొక గొప్ప కార్యమును ♦ జేయంబూని నీతోడ సం
  శృతమును జేయ దలంచి బిల్పితిని సు ♦ శ్రేయస్కరంబొప్ప ప్రి

స్తుతమా కార్యము నిర్విశేషముగ సం ♦ తోషంబులో జేసినన్
క్షితికందుండది మెచ్చు నిచ్చు మనకున్ ♦ శ్రీకైలాసమున్ ॥

వ॥ సుందరీ ఇహ పరసాధనంబునకు మూలంబగు నేనొక గొప్ప శుభకార్యంబుం జేయ దలంచి నిన్నిప్పటికి రావించితి తత్కార్యంబు నిర్విఘ్నంబుగా నెరవేరిన మనకు మోక్షంబు సిద్ధించ గలదు విన్నావా.

సు॥ అదియే శుభకార్యమౌ కని విదితంబుగ విన జేయుడి ॥ అది ॥ పదపడి శ్రీకైవల్యము - అదెట్టుల దొరుకును శ్రీహరు డెట్టుల మోదించును ॥ అది ॥

క॥ శ్రుతులున్ స్మృతులుం దేవత ♦ తతులుం గానంగ లేని తచ్ఛివుని పద ♦ స్థితియేలాగున దొరుకును ♦ వ్రతమేదో వినంగ జేయ వలయు మహాత్మా ॥

వ॥ నాథా వేద శాస్త్రేంద్రాదులకైన లభించని పరమ పదవి సులభోపాయంబున లభించు వ్రతమెట్టిదో నిస్సంశయముగా వచించి నా డెందంబునం గల సందియము మాన్పుము.

చి॥ మదవారణ యానరో వినుమది దెలిపెద నిక్కంబుగ ॥మద॥ పదయుండగు శివుపేరిట - ముదమున జంగమ పూజనమును గావింపగ బూనితి ॥మద॥

మ॥ శివుపేరన్ శివుగూర్చి యర్చనము ♦ నేజేతున్ మహా శైవులన్
సవిశేషంబుగ నర్థులే మడిగినన్ ♦ సద్ద్రవ్య రత్నాదివ
స్తువితానంబుల నిత్తు భక్తుల మన ♦ స్సార్థింసమర్థింతునం
చువిది యావ్రత మూనితిన్ వినుమునా ♦ ను క్తిన్ మరిన్ దప్పబోన్॥

వ॥ తరుణీ అస్థిరంబైన యీ శరీరంబును నమ్మి వృథా కాలక్షేపంబు జేసుటేమి లాభంబు లేదని మోక్షంబు లభించుటకై యీశ్వర ప్రీత్యర్థంబుగా జంగమారాధనంబుం జేయ సమకట్టి భక్తులేమడిగిన నిత్తునని ప్రతిజ్ఞబూని ధర్మకంకణముగట్టితి ఇదినీకిష్టమేన.

సు॥ సరెమంచిది నీవా యీశ్వరు పేరం జేయ బడిన॥సరె॥ వరవ్రతమును వలదనగను - మరి నానోరెటు లొప్పును నరవరమీరెవచించుడి॥

క॥ నరవర నీవొనరింపం ♦ బరగిన వ్రతమునకు భంగ పాటొనరింపం
బరగుదునే కాని వినుమొక ♦ సరణినివచియింతుధర్మ సరణియగాగన్॥

వ॥ నాథా నీవుం జేయఁబూనిన వ్రతము మంచిదేకాని అందు మె న్నో పరీక్షలు జరుగును నీవన్ని పరీక్షల కోర్చెదేని వ్రతంబు బూనుము వద్దనుట కెంతదానను సత్యంబు మాత్రంబు దప్పగూడదుగదా.

చి॥ ధర సుందర కూర్ణపల్లి ధామిండగు మహాదేవుని ॥ధర॥ కరుణ గలదు యిందుకయ్యా - పరితాపం బెందుకువ్రత భంగము గాదెటులైనను ॥

వ॥ తరుణీ సకల కల్యాణ గుణగరిష్ఠుండగు యీశ్వరుని కటాక్షం బున్న యెడల యెట్టి భంగంబు వాటిల్లదు తత్కార్యంబు నిర్విఘ్నంబు గానె నెరవేరగలదు. ఇందుకు తొందరేమిలేదు విన్నావా.

సూ-వ॥ నాథా మంచిదే కాని యొక్కమనవి

చి-వ॥ యేమి మనవి.

వాడము - యేకతాళము.

సు॥ నరనాయకా మరి నాదుమా - టిరవొంద వినుమిక తెల్పెద ॥ నర ॥ సరె దీనికొక్క - సంధి గలదు నిక్క - మరయ వలయు నీయాత్మ యందు ॥ నర ॥

వ॥ నాథా నీవిట్లు జేయం బూనిన వ్రతంబునకు మదీయులకెల్ల మహా దానందంబె కాని దీనికొక్క సంధిగలదు వినవలతువేని విన్నవిం చెదను.

చి॥ తరుణీ మణీ - తగ నీమదీ - యిరవుగ ననుమానించె దేల ॥ తరు ॥ త్వరయట్టి వార్త - మరినాకు పూర్త - విరివిగ నేడిట విన్నవించుము॥

వ॥ సుందరీ యాసంధి విధాన మెట్టిదో విన్న వించుము అనుమానిం చెద వెందుకు.

సు॥ మునుపెందరో - మనుజేశు లీ - ఘన వ్రతమును పెంపున బూనియు ॥ ముసు ॥ పెనుబాధ లొంది - రన వింటి సంధి - వినయంబుగ నిదె విన్నవింతు ॥ మును ॥

సీ॥ మును హరిశ్చంద్రుడీ ఘన పద్ధతిని బూని గాధి పుత్రుని చేత కష్ట
మొంగె । దారాసుతాదులు తాను నమ్ముడు వోయి తుదకు సద్గతి
నొందె ముదమెలర్ప । భల్లాణుడీవ్రత పద్ధతి బూని తనయిల్లాలు శివు
నకు నిచ్చి పిదప । సద్గతి గనెను యాచందమామ కూకద మహా
రాజు కైవల్య మహిమ గనెను । ధర్మ రాజ సుమంతైన దప్పలేదు ।

గాన యీపద్దు తమరెట్లు గడప గలరో। మాయవేషముతో వచ్చి మదన వైరి। యేమియడిగిన లేదన కిచ్చి కీర్తి। సద్గతిని గాంచుడిక రాజ సమ్మతముగ॥

వ॥ నాథా యీలాటి రాజులెందరో ముందీ వ్రతంబు బూని శివుల పాలైన రనవిందును కావున నీవీ వ్రతంబెట్లు గడప గలవో యేకవేళ పరమేశ్వరుండే నీభక్తి జూడనెంచి మాయ వేషముతో వచ్చి యడుగరాని దడుగును అడిగి నప్పుడు నీవేమందువు యేమనక యతని కోర్కె దీర్చి వచ్చుటమే మంచిది గాని సత్యంబు మాత్రము విడువ గూడదు.

చి॥ వనజాక్షినీ - మనమందునీ - యనువున సంశయమును జెం దెదు ॥వ॥ వినునాదుమాట - వినుపింతు తేట - పనిబూనియు నాప్రతి జ్ఞయును ॥వ॥

ఉ॥ వారిధులేడు నింకినను ♦ వహ్నిశిఖల్ చలువైన భోగిభూ
భారము మానినన్ శశియు ♦ భాస్కరుటుల్ తెరవొప్పదప్పినన్
మేరువు క్రిందు మీదయిన ♦ మిన్ను విరింగిన భూమిదొగ్గినన్
తారలు వ్రాలినన్ మతియు ♦ దప్పను స్వప్నము నైనకోమలీ॥

వ॥ సుందరీ వింటివా యీ యసాధ్యమైన కార్యంబులు క్రిందు మీదైనను నేనాడుమాట దప్పను ఇది సత్యంబని నమ్మము నమ్మి నీమన సిమితంబుగ నుండుము నేనీ వ్రతంబుచే యచ్ఛితకంఠుని మెప్పించి మోక్షంబు సాధించెదను.

సు॥ అటులైననీ - విటజేయుమా - పటుతరముగ సద్భక్తార్చన॥ అటు॥ నిటలాక్షుకరుణ నీపై మెండుగ్గబరపజా - స్ఫుటముగ జయమంతేట నీకగు ॥అటు॥

వ॥ నాథా యెన్నియైన సత్యంబు విడనాడక వ్రతంబు నిల్పుము - ఇదియే చా ముఖోద్దేశము.

చి॥ కుటిలాలకీ - కూర్గపల్లిలో - దిటముగ నిలచిన దేవుడేలు॥ కుటి॥ యెటులైన గాని - యేను దప్పపూని - చటులోద్ధతివ్రత మిటు బూనితి ॥కుటి॥

వ॥ తరుణీ తొండరెండుకు మొన్నివిధంబులనైన యీవ్రతంబు నిలిపి భర్తల యభీష్టార్థంబు లొసంగి తదాశీర్వాదంబు లొంది శితి కంఠుని మెప్పించెదగాక.

సు-వ॥ చిత్తము నాథా ఆలాగే యొనరింపుచు గాని సత్యంబు మాత్రము తప్పవద్దు.

చిరు-వ॥ భరిమంచిది (అని మంత్రితో) మంత్రీ మత్కుమారుం డగు సిరియాళునిందొకసారి రావించుము వాని విచారం బరసెదను.

మం-వ॥ చిత్తము ప్రభో ఆట్లులనే రావించెదను (అని అంజరు నిష్క్రమింతురు)

సిరియాళుడు ప్రవేశము - దరువు - రూప.

సిరియాళుడ॥ వినరా - నరపాల శేఖరుండను ॥సిరి॥ చిరుతొండా వళి పాలుని చిన్నికుమారుడ ధీరుడ - సరసిజవైరి ముఖుండను వర హాలాత్స్యావహుడనే ॥సిరి॥ నీతి కోవిదురా - ప్రఖ్యాతి నొందినట్టి వాడను నే॥నీ॥ భూతసఖుండను చిరుత వ్రాత సఖుండను ధరణివు - నీతమనమ్ముడ రిపు సంఘాతవి జేతనుడను ॥సిరి॥ మోదమానసుడా - జల్ వేదశాస్త్ర వేదినై వెలసిన ॥మోద॥ మేదిని కూర్ణపురీశు మహా దేవుని నెరనమ్మియు - సాదరమున తత్పదములు స్మరియించి భజించెటి॥ సిరి॥

వ॥ ఓహో మజ్జనకుండగు చిరుతొండ మహీధవుండు నన్నెందుల కో రమ్మనియొనట నేనచ్చటికేగి యాసంగతి యేదో తెలిసి కొనియెద గాక (అని తండ్రివద్దికింజని) జనకా అభివాదనము నన్నిందు రావించిన కారణం బేమో శృతపరచుడు.

చిరు-వ॥ కుమారా సిరియాళా వర్ధిల్లుము వర్ధిల్లుము నిన్నిందు రావించిన పని యిదిగదా,

వాడము - యేక.

చి॥ తనయ వినిపింతు వినరా - వేవేగనూ ॥తన॥ వనిబూని జంగమారాధన జేయబూనితిపుడు - అనువొందగను నీకిష్టమును యేన యిది యు మరియు ॥తన॥

వ॥ కుమారా నేనా సర్వేశ్వరుండగు గంగాధరుని పేర జంగమారాధనంబుం జేయ సమకట్టి యున్నవాడ ఇది నీకిష్టమేన యేది వక్కాణించుము.

సిరి॥ జనక సద్గుణ వార్ధిధీరా - నానాయనా ॥జన॥ మునుకొని నీవు శ్రీకంఠుని పూజజేయగోరి - నను నేను వద్దనగను నెంతటివాడ నోరెటులాడు ॥జన॥

వ॥ తండ్రీ భక్తవరాధీనుండగు పరమేశ్వరుని పేర నీవువక్రమించిన భక్తారాధనంబునకు వద్దనుటకే నెంతటి వాడను మీ మనోభీష్టంబెటులో యట్లే నెరవేరింపుడు.

చి॥ నీనీతివాక్యంబులకూ - నోనాసుతా ॥నీనీ॥ నేనెంతో సంతోషించి నెలకొల్పె నీపై ప్రేమ - భానుప్రకాశనాదు భాగ్యంపు కుమార తండ్రీ ॥నీనీ॥

వ॥ కుమారా నీధర్మ ప్రబోధంబున కేనెతో సంతోషించితి సరి నీవంటి పితృభక్తి తత్పరుని నేనెందు జూడనైతి తండ్రీ మహాసుజ్ఞానివి గదా.

సిరి॥ నోనాయనా నీమదిలో - నూహించినా ॥నోనా॥ యీనిర్మల వ్రతమెంతో యీప్సితార్థములానిచ్చు - గాన శ్రీకూర్మపల్లీ కరకంఠుడే గతి మనకు ॥నోనా॥

వ॥ నాయనా నీవుం జేయబూనిన వ్రతంబునకు సంతోషమే కాని యిందులో ననేక పరీక్షలు సంభవించునన నిందును కావున దృఢ మనస్కుండవై తద్విఘ్నంబున కోర్చి వ్రతంబు నిల్పుము నిల్పిన నీవి మజ్జగంబుల కీర్తి వహించి పొగడొందగలవు.

చిరు వ॥ సరి మంచిది (అని మరితిరిగని) మంత్రి మత్సతి సుతుల యభిప్రాయంబులుం దెలిసికొంటిని యింక తడయనేల నీవిప్పుడీ కంచీపురాధ్యక్షుండగు చిరుతొండరాజు జంగమారాధనంబుం జేసి షడ్రసోపేతంబుగా కుడువంబెట్టి వెవ్వరేని యర్థ లేమేమి యడిగిన యాయా పదార్థంబు లెల్ల నిచ్చుటకై ధర్మకంకణ బద్ధుండై యున్నాడని నానా దేశంబులం గలుగు భక్తులకు దెలియుటకై చాటించం బంపుము ఇదియే మదాజ్ఞ.

మం-వ॥ చిత్రము ప్రభో ఆటలనే యొనర్చెద గాక (అనినిష్క్ర-మించి)

మంత్రి - దరువు యేక.

వినుడి వినుడిక యోష్టరిక్కులంగల జనములు భక్త మహేశ్వరులూ జనుదెంచుడి కంచి పట్టణంబునకును మీరందరు వేగ లూ॥విను॥ చిరుతొండమహీధవుండు నిప్పుడు సేయుబూనె జంగమార్చనల్ - మరి యేమడిగిన నిచ్చు నర్థులకు సిరిసంపద లెట్టిదైనబల్ ॥విను॥ అడుగకున్న వొట్టు మీకు నడిగిన దిడకయున్న వొట్టు మాకిలన్ - వృదము ల్వగ్ణవల్లి శివుని సాక్షిగ యెడబాయక రండు రండిలన్ ॥విను॥

వ॥ ఓహో భక్త మహేశ్వరులారా రండు రండు యీకాంచీపురంబునకు యీకాంచీపురాధ్యక్షుండగు చిరుతొండ మహారాజు భక్తుల పూజించి షడ్రసోపేతంబుగా కుడువంబెట్టి కోరిన పదార్థంబులెల్ల నిచ్చుచున్న వాడు కావున మీరందరు వచ్చి యడుగకున్న వొట్టు మీరడిగిన పదార్థంబులెల్ల యివ్వకున్న మాకు వొట్టు ఓహోహో వినుండు వినుండు రండు రండు (అని చాటించి నిష్క్ర-మించును)

మహేశ్వరులు ప్రవేశము - దరువు - యేక.

రారాశివలింగ - రారా బసవలింగ - రారా రాజలింగ - రారా పోదామిపుడు ॥రారా॥ ఆరూఢిగ పాంచాల దేశమున నలరుచున్న కంచి పురిలో - పేరొందిన చిరుతొండరాజు భక్తారాధనము జేసిరిలలో - కోరిన వస్తులనెల్ల కోరికతో నిచ్చునటా - కొరులేక పోదము మన వారందరిలోను గలసి ॥రారా॥ పప్పు పులుసు వంకాయ శాకములు గొప్పగొప్ప మధుర భక్ష్యములల్ - కుప్పలుగను భోంచేయ బెడుదురట దప్పడంబు చారుభోజ్యముల్ - అప్పుడపుడుగాచిన ఘృత మొప్పినంత పాలుపెరుగు దొప్పలలో బోసి కుడువ నొప్పగింతు రెన్నొ విధము ॥రారా॥ యీరీతిగ కుడువబెట్టి కోరిన వారివారి కోర్కెరీతిగా - కొరులేక ధనధాన్య వస్త్రములు భూరి భూషణంబులు బహుగా - యేరీతిగ నడిగిన మరి యారీతిగ నొసగునటా - చారుకూర్ణవల్లి నిలయు గౌరీశ్వరు సాక్షిగనిటు ॥రారా॥

వ॥ ఒరే శివలింగా ఒరే బసవలింగా ఒరే రాజలింగా మనమందర మిప్పుడా కంచీపురంబునకుం బోయి చిరుతొండ రాజుచే నతిథి

సత్కారంబులంది మనమనకిష్టమైన పదార్థంబులంగ్రహించి వత్తము రారండు యీ చిరుతొండరాజు మహా పుణ్యాత్ముండన వింటిమి యేదడి గిన నదియిచ్చునట.

మహేశ్వరులు వ॥ అపునవును అట్లులనే పోదాము పదుండు యని కాంచీ పట్టణంబునకు (అనిపోయి చిరుతొండరాజును సమీపించి యున్నంత)

చిరు-వ॥ హే మహేశ్వరులారా.

వాదము - యేక.

చి॥ దండంబులివో గొనుడి దండీశైవాగ్రణులారా। ఖండేందు ధర మూర్తులూ - బ్రోవుడీనన్ - చండప్రచండులైన చరమూర్తి తతులార చండాంశు ప్రతిమానులూ - బ్రోవుడీనన్ ॥దండం॥

వ॥ అయ్యలారా మీసుందర చరణారవిందంబుల కిదో వందనంబు లాచరించుచున్నాడ కటాక్షించుడు.

మహే॥ కొండేంద్ర తుల్య ధైర్య కోమరొప్ప వర్ధిల్లుము చిరుతొండావనీ నాయకా - రాజచంద్రా - మెండైన నీదు కీర్తి మేదినందంతట వెలసె దండి ప్రభూత్తంసకా - రాజచంద్రా ॥కొం॥

వ॥ రాజా వర్ధిల్లుము వర్ధిల్లుము నీకీర్తి ముల్లోకంబులందు వెలసి తులదూగుచున్నది గదా అబ్బా నీయంత పుణ్యాత్ముండీ లోకంబునం గలడా.

చి॥ పూజింతు మీదు పాదాంభోజ ద్వయంబు లాను జాజి గన్నేరు పూలా - శైవులారా - నేజేయు దుష్కృతంబు బోకేను గను ధూపరాజి హారతు లిచ్చెదన్ - శైవులారా ॥ పూజిం ॥

వ॥ అయ్యలారా మీపాద పద్మంబుల కిదో షోడశోపచార పూజలుం జేసి షడ్రసోపేతంబుగా కుడుకం బెట్టెనాడ భుజించి నాడెందంబానందింప జేయుడు.

మహే॥ రాజేంద్ర నీవుజేయు పూజాది సత్కారము లాహా శెందెది శివుబాగుగా - రాజచంద్ర - నీజేయు భోజనంబులకై జెందెదతృప్తి మాకు యీజగంబుల్ మెచ్చగా - రాజచంద్రా ॥ రాజేం ॥

వ॥ రాజా నీవొనరించిన పూజాది సత్క్రియలచే మా మనంబు లెంతో సంతసించినవి సరి నీభక్తి ప్రకీర్తి యిమ్మూడుజగంబుల వెలయుగాత,

చి॥ ఘనులార మీ కేమియును గావలెనో నాతో - వినజేయుడా కోరికల్ - శైవులారా - అనవాండ్ర మీకు కోర్కెలును దీర్తు సంశయింపక - కను దెల్పుడిక మీరిలా - శైవులారా ॥ ఘను ॥

వ॥ భక్తాగ్రగణ్యులారా మీకేమేమి వస్తువులు గావలయునో యడుగుడు తప్పక నేనిచ్చు వాడ.

మహే॥ పంబూవి శ్రీకూర్మపల్లీశ్వరుని సాక్షి - జననాధమా కాంక్షలూ - దీర్చెదావా - వినయంబుగను మేము వినజేయునట్టి వేళ్ల - అనుమానమును లేకనూ - దీర్చెదవా ॥ పని ॥

వ॥ రాజా మాకావలయు వస్తువులు నీవిచ్చెదేని యడుగుదుము మేమడిగిన వెల్ల యిచ్చెదవో లేదో యేది చెప్పుము.

చిరుతొండరాజు

వ॥ అయ్యలారా మీ మనంబున కించిత్తైన సంశయింపక వలయు వస్తువులం గోరుడు తప్పక నే నిచ్చువాడ వున్నదో యేదోయని విచారించవద్దు యీశ్వర సాక్షిగా యేదైన నిచ్చువాడ యడుగుడు,

మహే-వ॥ రాజకా అడుగుదుమా.

చిరు-వ॥ అడుగుడు సంశయించెద రెందుకు.

వాదము - రేక.

మహే॥ జననాయక మా మదిలోనా · జనియించిన కోర్కెవిధము నా ॥ జన ॥ అనువొందగ మాకను నొసగుము నీ - వనుమానించక వినజేతుమిదో ॥ జన ॥

సీ॥ బంగారు సొమ్ములు బాగైన ముత్యాల కంఠ హారంబులు కడియములును। శాలి ధోవతులును కడుమంచి సెల్లాలు మడికస్త్రములు కంఠ మాలికలును। చిన్న పంచెలు మంచి సిరిమించు నంగీలు పాగలందెలు పట్టు వుట్టములును। బంగారుబటువులు వుంగరంబులు। మంచి ముంజేతి కడియముల్ మౌక్తికములు। పగడములు నీలములు రత్న వజ్రములును। మొదలు గాగల వస్తువుల్ ముదముతోడ। దెచ్చి

మాకిమ్మ యిదియేమా యిచ్ఛకములు ॥ రాజ రాజేంద్ర చిరుతొండ రాజచంద్ర ॥

వ॥ రాజేంద్రా యిరాయినవస్తు వితానంబు లెల్ల దెప్పించి మాకిప్వ ము యిదియే మాకిష్టము.

చి॥ ఘనపుణ్యులు సజ్జన మాన్యుల్ - మానసికారి మూర్తులు ధన్యుల్ ॥ ఘన ॥ అనఘులైన మీరు గోరిన వె - ల్లను నొసంగితిని గొనుడిదె ముదమున ॥ ఘన ॥

వ॥ అయ్యాలారా మీరు గోరిన వస్త్రభూషణాది వివిధ పదార్థం బులెల్ల యిదో మీకొసంగు చున్నవాడ గైకొనుడు.

మహే॥ అవివాహ్యంతే నాకును వలయూ - అర్థము లిపుడియ్యగ వలయూ ॥ అవి ॥ వివిధతురగ భట నివహ రథంబులు - అపరిమితముగ పుర అగ్రహారములు ॥ అవి ॥

వ॥ రాజా పెండ్లిగాని వాడను కాబట్టి గజతురగ రథాందోళిక భటసేవకాది గ్రామంబులు వరహాలు మొదలగు సంపద లొసంగి నాము నోభీష్టంబుం దీర్పుము దెనుదియ వలసు,

చి॥ సువివేక మహాత్మక నీవూ - వివరించిన వెల్లను లావూ ॥ సువి ॥ సవినయముగ నే సమర్పించితిని - యింకెదు గొనుండిక యిష్టసిద్ధి గను ॥ సువి ॥

వ॥ మహానీయూ జంగమవర్యా నీవడిగిన గజతురగ రథాందోళికా ది వివిధ పదార్థంబులిదో యిచ్చుచున్నవాడ మచ్చికతో సుగ్రహించి మీ యిచ్ఛలీడేర్చు కొనుడు.

మహే॥ ఇలనాథోత్తమ నామదిలో - గలిగె నొకటి వాంఛిత మిలలో ॥ యిల ॥ తెలిపెద వినుమిక తెల్లవారుకు లిం - తలా దెచ్చియు సత్వర నాకొసగుము ॥ ఇల ॥

వ॥ నరవరేణ్యా నాప తెల్లని తురుకులపై యపేక్ష జనించినది కావున యవి దెచ్చి నాకొసంగుము అట్టులైన నామది సంతోషించుము లేని యెడల నీపూజ బట్టదు నీభోజనము బట్టను.

చి॥ ఇల కూర్జపురీశుని నమ్మి - యిప్రుడె దెచ్చియిత్తును సుమ్మి॥ ఇల ॥ లలితముగను తెల్లని తురకలు యిం - దుబడైకై మది సోముల మొం దకుడిక ॥ ఇల ॥

గీ॥ శైవపుంగవ నీకట్టి సమయ మందు ♦ తెల్లచెరుకులపై పేర్మి దవ్వ్యముగను ♦ గలిగియున్నను నేదెచ్చి కడ.ముదమున ♦ నర్పణము జేతు గొనుడి లింగార్పితముగ ॥

వ॥ శైవోత్తమా యిట్టి తెల్లని చెరుకులపై యపేక్ష జనించిన యీ తత్క్షణంబున సకల దిక్కు లన్వేషించి యెక్కడ నున్నగాని తెచ్చి నీకర్పించెదను లింగార్పితంబుం జేసి భక్షింతువు గా క.

మహే వ॥ రాజా శీఘ్రంబునం దీసికొని రమ్ము కాని మా ఆజ్ఞా భంగంబుం జేయకుము సుమా మాయింగితంబు లీడేర్చిన నిన్ను గంగా ధరుండు మెచ్చగలడు పొమ్ము వేగిరంబున రమ్ము.

చిరుతొండరాజు

వ॥ పరిమంచిది మహాత్ములారా అట్టులనే పోవుచున్నవాడ ( అని నిష్క్రమించి ) ( తనలో ) ఓహో యీశైవపుంగవులీ యర్ధరాత్రి వేళ తెల్లని చెరుకులపై యపేక్షించి తెచ్చియ్యుమని సెలవిచ్చిరి గదా తెచ్చియివ్వకున్నచో నావ్రత భంగంబు కాగలదు తెచ్చెదనన్న యీయర్ధరా త్రిరి వేళ నేనెచ్చటికి బోదును ( అని యోచించి ) ఛీ అధైర్యంబున నిట్టి కార్యంబులు గానేరవు ధైర్యంబుం దెచ్చికొని యెచ్చట నున్న గాని తెచ్చి యిచ్చుటయే మంచిది ( అని క్రమ్మర )

దర్వు - యేక.

నేబో యెదరా । యీయర్ధరాత్రి ॥ నేబో ॥ ప్రాబల్యముగ తె । ల్లని చెరుకులకై ॥ నేబో ॥ ధీబలంబుచేత సర్వ దిక్కులు దివ్యముగను వెదకి తెచ్చి భక్తుమ । నోభిమతమెల్ల దీర్తు మదిలో నేభయంబు లేక మెల్లమెల్లన ॥ నేబో ॥ కంటకములు గుబ్బిశిలలు దాకియు కాళ్ళకెంతో శ్రమలు గల్గినను యీ । మింటసురలు నన్నుజూచి మెచ్చగ మేలిమైన ధైర్య స్థైర్యములతో ॥ నేబో ॥ చిత్రమేమొ కాని యురుములు మెరుపు లు ధాత్రినల్లబెండి మేఘములును వి । చిత్రముగను రాళ్ళవాన గురిసెను చీకటింత గప్పియైన వెరవక ॥ నేబో ॥ అడుగులోన అడుగు బెట్టి మెల్లన నడుచుకుంటు జేసవచ్చితిని చెరుకు । గడలు గల్గుతోట కేప్పుడును యీవుడమి కూర్గపల్లి యీశుకరుణ చే ॥ నేబో ॥

వ॥ ఓహో యెట్లనో శ్రమపడుకుంటు యిన్నియిక్కట్టుల కోర్చి యీతోట జేరితినిగాని యీ వంశుకరుణచే యీ చెరుకులనరికి మోపుగట్టుకొని పోయెదగాక ( అని గొడ్డలిచే చెరుకునరికి మోపుగట్టుకొని యెత్తుకొనబోవ లేవకున్నంత ) ( తనలో ) ఓహో ఇదియేమి చిత్రము యీ పరశుచే చెరుకంత నరికి మోపు గట్టుకొని శిరంబుపై నెత్తుకుందమన్న లేవకున్నది గదా యిక నేనేమి సేయుదు సేయునదేమి సగంబు దీసివైచి కడమది యెత్తుకొని పోయెదగాక ( అని అట్లుజేసిన లేవకున్నంత ) ఇది యేమి కాలము సగంబుదీసిన నైన మోపు లేవకున్నదే హా దైవమా ఇందుకు నీదే భారమురా తండ్రీ ( అని వేడియు )

దర్వు - యేక.

రారా నన్నుబ్రోవ మహాదేవ ॥ రారా ॥ రారా కరుణాకరసాంద్ర వృషయూర వాహన గురుతర గేంద్రహార మన్మథాంతక ॥ రారా ॥ రార రార బృందారక మునిమం - దార వృషధ్వజ గౌరీశ్వర యిటు॥ రారా॥ యేలా కఠినంబు వలదు గుణజాల నిన్ను బ్రతిమాలి వేడియున్నగాని రావిటు ॥ యేలా ॥ లాలితముగ ముని బాలుని బ్రోచిన - లీలనన్ను గుణశీల బ్రోవగను ॥ రారా ॥ నిష్ఠా భోనాశకుడ శేఖర ప్రముఖ్య పరమేష్ఠి వినుత పాదపద్మ నాయొక ॥ నిష్ఠా ॥ శ్రేష్ఠముగను నాశిరము నందుంయీ - కాష్ఠము నెత్తగ కరుణాన్విత యిటు ॥ రారా ॥ దేవాదేవాది దేవముని జీవోదరఖిల జీవకోటి సహిత విశ్వ శ్రీమహ ॥ దేవా ॥ కోవిదనుత శ్రీకూర్ణపల్లి గృహ - భావజారి నను పాలించగనిటు ॥ రారా॥

సీ॥ మున్నుమార్కండేయ మునినిన్ను బ్రార్థింప ♦ చిరజీవ మొసగి రక్షింపలేదె ♦ దివిజుల మొరవిని తీక్ష్ణమైన విషంబు ♦ ద్రావి ముజ్జగముల గావలేదె ♦ బాణాసురునియింట బంటుకైవడి యుండి ♦ యతని రక్షింప వే క్షితితలమున ♦ సురరాజ సుతుడు నిన్ స్మరియింపగను పాశుప ♦ తమిచ్చి యతని గాపాడలేదె ♦ గాన వారి విధంబెనన్ కరుణజేసి ♦ నిష్ఠ బోసివ్రతుండ యీకాష్ఠమిపుడు ♦ శిరము పైనెత్తి భక్తుల చిత్తములను సంతసింపగ జేసినన్ సాంబశివా॥

వ॥ శంకరా పాపభయంకరా ఆపత్కాల బాంధవా ఆపన్నరక్షకా జగద్రక్షకా నీవీ తక్షణంబున నాకీ చెరుకుల మోపు శిరంబుపై నెత్తి

నావ్రత భంగంబు గాకుండ జంగమ మనోతృప్తిం జేయుము దేవా మహానుభావ (అని వేడుకున్నంత యీశ్వర కటాక్షంబున సులభోపాయంబున లేచినంజూచి తనలో) ఆహా శివ కటాక్షం బెంతదొడ్డది సేనాతని నామం బు పలికినంత మాత్రంబుననే నాయంతంత దుఃఖ దళం బి నాకి మోపులే చెనుగ వా సరి నేనిప్పు డచ్చటికింపోయి యీతెల్లని చెరుకులా శైవులకొసంగి వారి మనోతృప్తిం జేసెదగాక (అని పోయి శైవులంగని (ప్రకాశముగా) మహేశ్వరులారా ఇటొకసారి వినుండు,

మహే-వ॥ రాజా యేమిసమాచారము తెల్లని చెరుకులు దెచ్చితివా,

చిరు-వ॥ అయ్యలారా!

ఉ॥ మీరను చందమేనిపుడు ♦ మేదిని యంతట దిర్గితిర్గి వి
స్తారముగాగ తెల్లనివి ♦ శౌనుచెరుకులు ఖండఖండముల్
గారచియుంచి మోపుగను ♦ గానొనరించియు తెచ్చినాడమీ
కోరిక దీర మెక్కుడుప ♦ కుంఠిత భక్తి శివార్పదీర్పియుక్ ॥

వ॥ జంగమ వర్యులారా మీ కోరిన విధంబుననే తెల్లని చెరుకులందెచ్చినాడ యిదే గైకొని శివపూజ జేసికొని లింగ నివేదనం బొనరించి మీబుద్ధిదీర భుజించుడు (అని తెల్ల చెరుకు లొసంగిన మెసంగి)

మహేశ్వరులు-వ॥ అహాహా రాజా ఇటు వినుము,

ఉ॥ భూపవరేణ్య నీవిపుడు ♦ భూరిగ మామది కోర్కెదీరయీ
తేవను తెల్ల చెరుకులను ♦ దెచ్చియొసంగితి గాని మామదిన్
నొపిన యంత సంతసము ♦ నొందెను నీవు నొసంగుదానమా
శ్రీపరమేశు జెందెమరి ♦ శీఘ్రమునం జనివత్తు మిప్పుడున్ ॥

వ॥ రాజా నీవుమాకొసంగిన దానధర్మంబు లాశివునకు ముట్టెను కావున మామనంబులెల్ల సంతోషించినవి పోయివచ్చెదము సెలవొసంగుము.

చిరు-వ॥ అయ్యలారా పోయిరండు మీకిదే నమస్కరించెదను.

మహే-వ॥ దీర్ఘాయుష్మానస్తు పుత్రపౌత్రాభి వృద్ధిరస్తు నిత్యముక్తిప్రాప్తిరస్తు (అని నిష్క్రమింతురు)

చిరుతొండరాజు మంత్రితో

వ॥ మంత్రీ నానాదేశానంత శైవ బృందంబులకెల్ల కోరిన పదార్థంబు లొసంగి సంతృప్తిం జేసి సాగనంపితిని యింకా యెవ్వరు వత్తురో రానిమ్ము వారివారికిం దగు వస్తువితానంబు లొసంగి తృప్తులం జేసి పంపవలయును గదన్నా.

మం-వ॥ దేవా అట్టులనే కానిండు మనమిదే లోనికేగుదము రండు స్నాన సంధ్యానుష్ఠానంబునకు వేళ యైనది.

చిరు-వ॥ సరిమంచింది పావమ్మా (అని నిష్క్రమింతురు)

కైలాసము

పార్వతీ పరమేశ్వరులు ప్రవేశము - దర్వు - యేక.

పర॥ పార్వతీశుడరా - ధరణిలో పాపనాశుడరా ॥ పార్వ ॥సర్వేశ్వరుడను సాక్షీభూతుడను - సర్వమయుడ రిపు గర్వాపహుడను - నిర్విచారుడరా - ధరణిలో - నిగమ వేద్యుడరా ॥ పార్వ॥

వ॥ నందికేశ్వరా సనకసనందనాది సకల సురముని యోగీశ్వర వంద్యుండనై జగదుత్పత్తి స్థితి లయ కారణ కర్తృత్వ స్వభావంబు గలిగి బ్రహ్మ విష్ణు మహేశ్వర త్రిమూర్త్యాత్మకుండనై పరబ్రహ్మ స్వరూపంబున వెలింగెడు పరమేశ్వరుండని యెల్లలోకంబులకు విశదమైనదియే కదా.

నందికేశ్వరుడు

వ॥ పరమేశ్వరా పరంధామ నీమహిమాతిశయంబెన్న బ్రహ్మేంద్రాది దేవతల వశంబుగాదు అజ్ఞానుండనగు నాబోటి వానికలవి యగునే.

పార్వతి - దర్వు - యేక.

సర్వమంగళనూ - హిమవత్ - పురతాత్మజనూ ॥ సర్వ ॥ సర్వేశ్వరిని సువర్ణార్చితను మ - హోర్విమదాసుర గర్వచ్ఛేదిని - పార్వతీ సతినీ - ధరణిలో - పాప సంహారినీ ॥సర్వ॥

వ॥ నందికేశా సరసుర దానవాది జీవకోట్యర్చిత పాదాంభోజయుగళనై ఆదిమ శక్తినై త్రిజగజ్జననినై దుష్టదానవానీక గర్వాపహారి

జినై సర్వోపద్రవ నివారిణినై సర్వకామార్థసిద్ధి ప్రదాయినినై పరమేశ్వరార్ధాంగినినై ప్రభవిల్లిన పార్వతియను నామాంతరంబు గల దానను ఇది జగద్విదితమే కదా.

నంది॥ తల్లీ పార్వతీ జగన్మాత యుష్మత్ప్రభావాతిశయంబుల వర్ణింప శేషభాషాధిపతులుం జాలరు నేనన నెంత.

పరమేశ్వరుడు - దర్వు - ఏక.

త్రిపురముల గూల్చి - మృత్యువును - విపులముగ గెల్చి ॥ త్రిపు ॥ చపలుడైన సిరిపతి మదంబును - నపహరించి విషమపుడు గ్రోలితే - వపతి ముఖులు గొల్వ - వెలసితిగా విపులాద్రి నిల్వ ॥ త్రిపు ॥

వ॥ నందికేశ్వరా త్రిపుర పురాది దుష్టదానవుల నిర్జించి యముని మదంబణచి మృత్యువును జయించి కాలకూట విషంబును గ్రోలి సురల రక్షించి ఇంద్రాది ముఖ్యదేవత వంద్యుడనై వన్నెకెక్కిన కొన్నెల వాల్పుని నన్నెన్నుదురు గదా.

నందికేశ్వరుడు

వ॥ దేవా మహానుభావ సర్వలోక శరణ్యుండవగు నీమహిమ ప్రకీర్తి ప్రభావంబు లీముజ్జగంబులలో వెలసి సజ్జన సంస్తవనీయమై పొగడ్త కెక్కెనుగదా-

పార్వతి - దర్వు - ఏక.

సుపథత్యక్తులనూ - శుంభని _ శుంభదైత్యులనూ ॥సుప॥ కపటులైన రక్తబీజమహిష - ఉపాచరుల ద్రుంచి పరమ పుణ్యుల - కృపతో బ్రోచితినీ - యొప్పుగనూ - రణభువి నిలచితినీ ॥సుప॥

వ॥ నందికేశ్వరా ప్రథమయుగంబున మహిషాసుర శుంభనిశుంభ రక్తబీజాది సమస్త దుర్మద నిశాటులం ద్రుంచి బ్రహ్మాది దేవతలుంజూడ తాండవంబు సలిపి పరమ భక్తాగ్రేసరుల రక్షించి పంచమహాశక్తి స్వరూపురాలనై వెలసిన మత్ప్రభావంబు నీకుం దెలియునుగదా·

నందికేశ్వరుడు

వ॥ తల్లీ ఇచ్ఛాశక్తి క్రియాశక్తి జ్ఞానశక్తి ఆదిశక్తి పరాశక్తి ఇత్యాది సర్వశక్తి సమన్వితురాలవై మూలప్రకృతి మహత్తత్త్వాది భూత

పంచక ప్రపంచంబున కాధార భూతురాలవగు నిన్నెన్న పరమ యోగీంద్రులుం జాలరు తల్లీ జగజ్జననీ లోకమాత పాహిమాం పాహిమాం.

పరమే-వ॥ నందికేశ్వరా ఇటూకసారి వినుము.

నందికే-వ॥ హేపర్మిభో పరమేశ్వరా దేమి సమాచారము,

వాదము - యేక.

పర॥ నందీశవినుము ముజ్జగంబుల యెందు గలుగు జీవకోటులెల్లను॥
నందీ॥ యెందుభయముళేక మత్సదాబ్జము లేదు భక్తి నిలిపి సంతతంబును నందనాంగనాది మిత్రయుత మానంద మొంగి సుఖము నున్నవారలె ॥నం॥

వ॥ నందికేశ్వరా త్రిభువనంబులంగల జంగమ స్థావరాది సకల జీవకోటులు మత్పాదార విందంబులం భజింపుచు తమతమ దారా సుతాది బంధువర్గంబులతో సుఖానందులై ప్రవర్తిలు చున్నవార లేకదా.

నత॥ కందర్ప హరణ మీదుకృపచే గలదు లోకమంత కల్యాణముగ ॥కంద॥ ఇందుమాళి సర్వరక్షకులరై యెపుడు మీరలుండ నేమి కొదవయు - నిందునందు శుభమె సార్వభౌమానందభావ యిందిరేశ మిత్రిమ॥

వ॥ దేవా సర్వాంతర్యామివై సర్వజీవుల రక్షింపుచుండ దుర్విచారం బెట్లు సమకూడును సర్వేను భవత్కారుణ్యంబున సన్ద్వైశ్వర్య సంపన్నత్వంబున సుఖస్థితినే యున్నది మహాప్రభో.

పర॥ రంభాది స్త్రీల బిల్వనంపుము రసికగీత నృత్యముల్ సల్పగను॥
రంభా॥ శుంభినీ సురాది శైవ పుంగవ శుంభద మల పండితోత్తముల సం। రంభముగను బిల్వనంపి శ్రుతి స్మృతి జృంభణములు దెల్పు జేయుము॥

వ॥ శైలాది సర్వసంగీత సాహిత్య కళా ధురంధరులగు రంభోర్వసి మేనక తిలోత్తమాద్య గంధర్వ స్త్రీలరప్పించి నృత్యగీతంబులుంగావించి ధరసుర శైవాది సకల పండితులచే సర్వ వేద వేదాంతాది రహస్యాంతర ధర్మంబులం దెలుపునట్లానరించి మద్హృదయ కంజంబానందిరవజేయుము,

నంది॥ శుంభీనసేంద్రి వలయధరశ్రీ కూర్మపల్లి మందిర మహాదేవా॥
శుం॥ జంభభేది స్తార్యమీరలను వాగ్జృంభణంబు రీతి జేసితిని వి - శ్వంభరాప్త జూడుకనుల కింపుగ శాంభవీ మనోహరా నలేక్షణ ॥శుం॥

వ॥ మహాదేవా భగవదాజ్ఞానుసారంబుగనే సవిస్తారంబుగ సమస్తంబు జరిపియున్నవాడ నీకందోయి కందంబుగా దిలకించుము.

పరమేశ్వ-వ॥ సరియగునది (అని తనలో) ఓహో మద్భక్తాగ్రే సరుండగు చిరుతొండడు జంగమ మనోభీష్టార్థంబు తెల్లని చెరుముల్లైకె వెళ్ళి మోవు లేవనండి నన్ను ధ్యానించిన నేనా మోహాలకి లేచనట్లో నరించితి కావున అట్టి భక్తుని మాహాత్మ్యంబీ కాత్యాయనికి దెలియుటకై మచ్ఛరీరమంత చెమర్చినట్లుగా జేసి కొంత చిత్రంబు జూపించెదగాక (అని మెయినిండ చెమట బుట్టించినంజూచి)

పార్వతి (తనలో)

వ॥ ఓహో ఇది యేమిచిత్రము కున్నడు లేనిమన్నాథున కిప్పుండు మేనెల్ల బుగ్గబుగ్గన చెమరించుచున్నది ఇది యేమి హేతువో కాని తెలియకున్నది గదా యేది విచారించి తెలిసి కొనియెదగాక (అప్రకాశముగా) మనోహరా పరమేశ్వరా ఇటొకసారి నామనవియంగీకరించుము.
పరమే-వ॥ మనోహరీ పార్వతీ యేమియనవి.

వాదము - రూప.

పా॥ శకలేందు మౌళి నామనవి యికను దెల్పెదను వినుడిక ॥శ॥ మకర కేతనారియై దేమొకొ ఇద్దియు దేహమెల్ల - వికలముగను చెమటించెను - వినుపుడి తద్వృత్తము ॥శక॥

సీ॥ త్రిపురాసురులబట్టి ద్రుంచివైచిననాడు - నీశరీరంబున నీరు లేదు- అంధక దైత్యాది అరుల జంపిననాడు - నీశరీరంబున నీరులేదు - కాల కూట విషంబు గ్రోలి వెలసిననాడు - నీశరీరంబున నీరులేదు - ముని పుత్రుకై యముని మోది వైచిననాడు - నీశరీరంబున నీరులేదు - మృత్యువు జయించినపుడు నీమేన చెమట - గలుగ లేదిపుడు నిర్హేతుకముగనిదు- దేహమెల్లను చెమటించె దేవదేవ - యేమి హేతువో కాని నాకెరుగ బలుకు ॥

వ॥ దేవా మున్ను నీవొనర్చు యసాధ్య కార్యముల యందైనను నీశరీరంబున చెమట బుట్టదు నేడే మో కాని నిర్హేతుకముగ నీదేహంబంత చెమటించినది కారణంబే మో వ్యక్తపరచుమా.

పర॥ సుదతిరో - సుదతిరో - వదపడి శ్రీకూర్మపల్లి ప్రభుడనై వచింతు వినుము ॥ సుద ॥ తుదురుగ నొక భక్తుడు తాగోరెను తెల్లని చెరుకులు - అదినిమిత్త మారాజున కిదయించెను గద యాపద ॥ సుద ॥

మ॥ ఒక భక్తుండు మదీయ కాంక్షకొరకై పోరాడనీవేగి మా
నక శ్వేతంబగు చెర్కులంగొనియు తెన్నెన్నక సరేయంచు గా
నకు తావచ్చియు నిత్యుకడపుల నెన్నిక గూర్చి యామోపు లే
వక యున్నంతున నన్ను దల్చినను లేవక నెత్తితిక్ వ్యాకిక్ ॥

వ॥ మహేశ్వరీ అట్టి చిరుతొండ భక్తునికి నొక్క మహేశ్వరుండు అర్ధరాత్రివేళ తెల్లని చెరుకులు కావలెనని యడుగ నందున నచ్చిరుతొండండుదులకై బోవు వెస మధ్యన నెన్నో కష్టంబులం బడి తుదకా చెరుకు తోటకేతెంచి యవి సంగ్రహించి మోపు గట్టుకొని యెత్తుకొన బోవు నెడ నది లేవనందున నన్ను ధ్యానించిన నేనాతనికి మోపు లేవనెత్తితి అందును గురించి నాకే చెమట బుట్టినది విన్నావా.

పా-వ॥ నాథా,

క॥ అహాహా నీభక్తమహా ♦ మహులమహా మహిమలెన్న మరి బ్రహ్మాదుల్ ♦ విహితముగ జాలరననో ♦ మహాదేవా విరటిగాదె మహితలమందున్ ॥

వ॥ మహాదేవా భక్తదేహాధీడవగు నీభక్తాగ్రగణ్యుల మహిమాతిశయంబెన్న బ్రహ్మాదులుం జాలరన విందును కాని అందులో వొక మనవి,

పర-వ॥ కాత్యాయనీ యేమి మనవి,

వాదము - రూపకము

పా॥ కరకంఠ మహేశ్వర శివ పరికింపగ యీభక్తుడు ॥ కర ॥ మరి యనుముందటి వారి - సరివచ్చున యెరిగించుడి ॥ కర ॥

క॥ కరమరుదుగ హరిశ్చంద్రుడు ♦ తరుణీ పుత్రకుల నమ్మి తాచండాలున్ ♦ మరిగొల్చె గాధిసుతుకై ♦ యరయగ నాతనితొ సాటి ♦ యగునే నితడున్ ॥

వ॥ పరమేశ్వరా సత్యవాక్పరిపాలనపరుండగు హరిశ్చంద్రునితో

సమానమౌ చిరుతొండడు వచ్చునా సత్యంబు నిచ్చునా యోచించి కాంక్షించుము.

పర॥ గిరిజా వినుమా హరిశ్చంద్రుని సరి యనదగు సత్యమునకు ॥గిరి॥
చిరుతొండండని జనములు - చరిచాటించిరి జగములో ॥గిరి॥

వ॥ పార్వతీ యా హరిశ్చంద్రునితో తుల్యుండని యీ చిరుతొండని నీ ముజ్జగంబులు ఘంటాపథంబుగ చాటించవిందుముగదా సత్యవాక్యంబున నాతని యంతటి వాడే యగును సంశయము లేదు.

పా॥ ఇల్లాలునొసంగిన యాభక్తాళుని సరివచ్చున ॥ఇ॥ నల్లనిగళ యీభక్తుడు నాకెఱిగించుము దయతో ॥ఇ॥

వ॥ దేవా తన ప్రాణవల్లభియగు చల్లమాదేవిని దానమిచ్చిన భక్తాళునితో సమానమౌ చిరుతొండుడు వచ్చునా తన భార్య నిమ్మన్న నిచ్చునా.

పర॥ వల్లభ యీ చిరుతొండడు భక్తాళుని సరివచ్చును ॥వ॥ కల్లయు నేబలుకజాల - కంఠీరవ గామిని విను ॥వ॥

వ॥ పార్వతీ యీ యుర్వీశ్వరుండా భక్తాళుని తుల్యుండని యెన్నవలయును ఇందులకేమి సందియము లేదు తన యిల్లాలి నిమ్మన్న నిచ్చును.

పా॥ మంచిది తన భార్య చర్మ మంచితముగ దీసియు మరి ॥మంచి॥ కొంచక యర్పించినయా - కూకద రాజును బోలున ॥మం॥

వ॥ దేవా తన నైవేద్యంపు లోయిల్లాలి చర్మంబు వొలిసి పాదరక్షలుగా జేసి సమర్పించిన యాకూకద మహారాజుతో సమానమౌ ధరణీశ్వరుండు వచ్చునా తన భార్య చర్మంబు దీసి చెప్పులు జేసి యిచ్చునా.

పర॥ చంచలలోచని వినుమా కంచీశుడు యాకూకద ॥చం॥ మించినవాడే యనదగు - మేలిమి భక్తిరసంబున ॥చం॥

వ॥ గిరిజా భక్తిభావంబున కీతండా కూకదుని మించినవాడే యని నమ్ముము ఇది దబ్బరగాదు అట్లు సేయుమన్న సేయును.

పా॥ సత్యము దప్పక నీతడు పలుపున నీవ్రతరాజము ॥ సత్య ॥ మృత్యుంజయ తన కొమరుని - మృతమొనరించ్చర్పించున ॥సత్య॥

వ॥ దేవా సత్యంబు దప్పని వాడైనచో మన ముద్దుల కొమరునిం బంపి ఖండఖండలుగా ఖండించి తన భార్యతో వండించి మనకు బెట్టునా యేది వాక్రుణించుము.

పర॥ కాత్యాయని వినుమయెంత కార్యము నాతనిలోయి॥కా॥ కృత్యము జేయించ మనకు - కూడునె కూర్ణపురివులకు॥కా॥

వ॥ పార్వతీ ఇదెంత న్యాయము మనమా భక్తుని కుమారుని గోరుటెట్లు యాతడాతని ఖండించి మన కిడుటెట్లు యెంతవారికైన పుత్ర మోహంబు విడుచునా విడక తనపుత్రుని ఖండించి తద్దుఃఖంబాతడెట్లు భరించును యేలా యిాదురాలోచన.

పార్వతి-వ॥ ఆహాహా పరమేశ్వరా నీమాట నీకేనిజములేకుండెనా

ఉ॥ ఆడినమాట దప్పడని ♦ యంటివి యిప్పటిదాక నిప్పుడే
పాడిదొరంగి పుత్రునెటు ♦ భంగము గాక వధించు నంచునీ
వాడితివైన నాతని ♦ ధృవంబగు భక్తి నెరుంగ గోరితిౕ
వేడిమి కంటి వోదమిదె ♦ వేడుక యాచికతొండు నింటికిౕ ॥

వ॥ పరమేశ్వరా సత్యధర్మ దాక్షిణ్య దాతృత్వ భక్త్యాదుల యందీ తనిబోలు ఘనుండు లేడని నీవే వచించి మళ్ళి యిప్పుడి దిప్పుడే తన కొడుకునెట్లు జంపునని యంటివి నీవోలనే బొంకు వచ్చెనుగదా అయినా యింక నేనాతని భక్తిభావంబులుంజూడని దూర్కుండను నిజంబుగ మన మిప్పు డచ్చటికిం బోయి వాని కొడుకును ఖండించి పెట్టుమని యడుగుదము అట్లు వాడు జేసిన మళ్ళి వాని కొడుకును బ్రతికించుము కావున ఇట్టి నాకోర్కె దీర్చవలయును గదా.

పరమేశ్వ-వ॥ ఆహాహా పార్వతీ నీకట్లున్న యెడల మనమిప్పు డచ్చటికిం బోయి వాని భక్తి పరీక్షింతముగాని మనమిా నిజరూపంబున బోరాదు పోయిన మన భక్తులెల్లరుం గాంచి మనను బోనివ్వరుగదా యేదో యొక మాయ వేషంబులతో బోయిన బాగుండునుగదా.

పార్వతి-వ॥ మంచిది మనోహరా అట్టులనే పోదముగాని యేదో రూపంబున బోయినబాగుండును.

పర-వ॥ గిరిజా నేనీరూపంబు దాల్చెద నిటువినుము.

మ॥ గిరిజా నేనొక వృద్ధజంగమమునై ♦ గేల్ కాలంటులుౝ వడ్కఁగన్
గర దండంబును బూని యక్షసరులుం ♦ గాషాయ వస్త్రంబులుౝ
నరయౝ దాల్చియు వ్యాఘ్రచర్మమును ♦ మేనంగప్పియుౝ గంటచే
చ్చెరహస్తంబున బట్టి యీ విధమునం ♦ జేకొందు వేషంబిలన్ ॥

వ॥ మనోహరీ శతమానాబ్దంబుల వృద్ధ మహేశ్వరుండనై వడవడ వడంకుచు కాళ్ళు తడబడ చేతిలో దండంబుబూని కాషాయ వస్త్రంబులుం ధరియించి మెయినిండ పులిచర్మంబునుంగప్పి చూపరుల కసహ్యంబగు నటుల కష్టవ్యాధి రూపంబుగా వచ్చెదనుగాని నీవేరీతివత్తువో చెప్పుము,

పార్వతి వ॥ నాథా నావిచారంబు వినుము,

పంచపాది ఉత్పలమాల

చందురుబోలు మోమునను ♦ చక్కని కుంకుమ బొట్టుబెట్టిమే
నందున పప్పుబూసి మెయి నవ్వగ ♦ సువర్ణ సుభూషణంబులుౝ
పొందుపడంగ దాల్చిసిత ♦ పుట్టము గట్టి మెరుంగు కంచుకం
బందమెలర్ప దొడ్గిపది ♦ యారును వత్సర యౌవనాంగినై
యందరుదెంచెదౝ వినగ ♦ దయ్య మనోహర మోహనాకృతిౝ ॥

వ॥ మనోహరా పదియారు సంవత్సరంబుల యౌవనాంగినై జంగమ స్త్రీరూపంబున పసుపు కుంకుమాది విభూతులం ధరియించి తెల్లని వస్త్రంబునుంగట్టి మెరుంగు టద్దంబుల రవిక దొడిగి పక్షంబున లింగ పేటిక వెలుంగ త్రిజగన్మోహనా కారంబుగా వచ్చెదను కాని యీతనిచే నెట్టులైన యబద్ధ మాడించ వలయును.

పరమేశ్వరుడు

వ॥ మనోహరీ యెట్టులైన వాడబద్ధ మాడువాడు కాదు గాని మన మైతే యీయీ రూపంబులం బోదము పదమ్మా.

పార్వ వ॥ మనోహరా అలాగే పోదము పదమ్మా ( అని నిష్క్రమించి మాయావేషంబులుం దాల్చి )

మాయా జంగమ దంపతి రూపులగు పార్వతి పరమేశ్వరులు ప్రవేశం

దర్వు - ఆదితాళము

పః॥ వచ్చితి జంగమ ముఖ్యుఁడనూ । వర దాతకుఁజ సౌఖ్యదనూ ॥ వచ్చి ॥ చెచ్చెరమరి నాచెలితోగూడియు । స్వచ్ఛముగను శ్రీశైలము నుండియు ॥ వచ్చి ॥

వ॥ అయ్యో వృద్ధత్వముకన్న కష్టమే లేదు చేతగాని వాడనై నిప్పటికిని వొక కారణంబువలన నా సతీ సహాయంబున నింతదూరము బోవలసి వచ్చెను అయినా నా యాయాసముదీర్పు పుణ్యాత్ముల నెచ్చ ట గాననైతిని గదా,

పా॥ మచ్చికంటు లిటు నను గనుడీ। మరి నామనవియు గైకొనుడీ ॥ మచ్చి ॥ మచ్చిక నాపతి యిచ్చలు దీర్చిన। వచ్చునువారి॥ వర కైవల్యము ॥మచ్చి॥

వ॥ హే పుణ్యస్త్రీ పురుష జనంబులారా నాభర్తాళుని మనో రథంబుం దీర్చిన పుణ్యాత్ముల కా కైలాసముం బొందుక గలదు గావున నా వల్లభుని కష్టవ్యాధి రోగంబు మాన్పి పుణ్యంబు గట్టుకొనుడు.

పర॥ కరదండంబును విడువకుమా । తరుణీమణి నను మరువకుమా॥ కర ॥ పరికింపగ నను వదిలముగనుగొని । యరుగుము గని వేగిరమున నడు వకు ॥కర॥

వ॥ ఓసే నాకఱ్ఱె బట్టుకొని మెల్లమెల్లగ నడిపించు కొనుచు దో డ్కొని పొమ్మె కాని తొందరగా నడవకుము యేదైన వొక రెత్తు భూమి దాకిన నా వ్రేలుపొట్ట బొత్తిగ వగిలి పోవును గదా,

పా॥ సరి యట్టులనే నడిపింతూ । ధవనామదిని వినుతింతూ ॥ సరి ॥ మరినీమది తొందర మానుము నా । కరమున నీకరమిరవుగ బట్టు ము ॥ సరి ॥

వ॥ నానా తొందర వడకుడు మెల్లమెల్లగనే తీసికొని పోయెదను నాచేయి బట్టుకొమ్మె,

పర॥ నడువ చేతగాదే రమణీ । కుడియ గూర్చొనియెదను ధర ణీ ॥ నడు ॥ వొడలెల్లను వడవడవడకుచు బల్ । తడబడి చెమటల్ బొడ మెనుగను మిదో ॥ నడు ॥

వ॥ అయ్యో నాప్రాణంబులు చీకుచున్నవి నాకేమి నడువ చేత గాదు ఇదో చూడుము నాశరీరమంత చెమట బుట్టినది వొకకుడియ సేపు కూర్చుందము,

పా॥ చిడిముడి పడనేలను స్వామీ । నడివీధియుగద యిదిభూమీ॥ చిడి ॥ మొడపక యింకొక యడుగిడి యచ్చట । విడియింతము నక్కడ నీడున్నది ॥ చిడి ॥

వ॥ నాథా యిరా యెండలో నెట్లు గూర్చుండెదరు యింకొక యడు గునడిచిన నచ్చట నీడ గలదు అక్కడ కూర్చుండ వచ్చును మెల్లగ నడువుడు అదిగాక ఇది నడిబజారు గదా.

పర॥ బోటిరో నాపాదము లొత్తవా। ఘంటలబడి వచ్చెడ మెత్తగా॥ బోటి॥ సూటిగ రాసభ బొటడిగియు నట। వాటముగను నచ్చోట జేర్చుమిక॥ బోటి॥

వ॥ తరుణీ కొంతసేపు నాపాదము లొత్తుము అటుపిదపనాత చిరుతొండరాజు సభాంతరమేదో యడిగి యచ్చటికి నన్ను ఓసికొని పొమ్ము ఆతడు మహా పుణ్యాత్ముండన. వింటిని యీ తనిచేయిరావ్యాధి మానగలదు

పా॥ మేటగు శ్రీకూర్ణపల్లిలో। మెలిగెడు శివరూపక నాలో॥ మేట॥ నీటుగ నీవను మాటజప్పకను। నేటుగ రాసభ కూటము జేర్చెద॥

వ॥ నాథా ఇదియే కంచీపురము అదియే రాజసభా చూడుము అచ్చటికిం బోయి మన యిాప్సితార్థంబులుం దీర్చికొన వలయు నాతండు మహా ధర్మకంకణ బద్ధుండై యెవ్వరేమడిగిన నిత్తునని ప్రతిజ్ఞ బూని యున్నడట విన్నారా.

పర-వ॥ మంచిది అందుకొరకే యాతనిం జేర బోవలయునని నా యభిప్రాయము గదా.

పా-వ॥ సరి అట్లులనే పోదమూరండు (అని నిష్క్రమింతురు)

చిరుతొండరాజు మంత్రితో

వ॥ మంత్రి మన్మనోభి లషితంబుండీర ధర్మకంకణ బద్ధుండనై యున్నందున యెవ్వరెవ్వరి యభిమతార్థంబు లెటులో యటులే దీర్చుచు వస్తినికాని యిప్పుడెవరో యొక వృద్ధ మహేశ్వరుడు తన భార్య యుక్తముగా వచ్చి మన ద్వారమందున్నడన వింటిని కావున వారి కెదురుం జని నమస్కరించి తోడ్కొని రావలయును అందుకు మన ప్రియ కాంతయగు సుగ్గులాదేవి నిందు రావించుము.

మం-వ॥ ప్రభో అట్లులనే రావించెదను (అని నిష్క్రమించును)

సుగ్గులాదేవి ప్రవేశించి

వ॥ మనోహరా నన్నిందు రావించినకారణంబే మోశ్రుతపరచుడు.

చిరు-వ॥ మనోహరీ అట్లులనే జెప్పెద నిటువినుము.

వాదము రూపకము

చి॥ వనజాయతాక్షి, వినవె నాదు మనవి నీవిపుడూ ॥వన॥ అనువుగ నొక వృద్ధజంగమయ్యె భార్య సహితముగ వ - చ్చినాడట యాతనిని నెదు ర్కొనగ వలయు నూ ॥వన॥

వ॥ మనోహరీ నూరు సంవత్సరంబుల పెద్దమనిషియగు నొక్క మహేశ్వరుండు తనభార్యా సమేతముగ వచ్చి మనద్వారమందున్న వాడట కావున మనమిప్పుడాతని యెదుర్కొని నమస్కరించి తోడ్కొని రావల యును అందుకొరకే నిన్నిందు రావించితిని గదా.

సుగ్గు॥ జననాథనాదు ప్రాణనాథ జయవినోదితా ॥జన॥ అనఘవీర లనువిధంబె యాదరింప వలయు మేము - జనుపెంతు మికేమొమాట నెల వొసంగుడీ ॥జన॥

వ॥ నాథా మీరను విధంబుననే యమ్మహనీయుని నెదుర్కొందము గాని మాకేమి సెలవో చెప్పుడు.

చి॥ కలకంఠి శైవ వరునిపూజ సలుపగా వలెగా ॥కల॥ జలమును గంధ మును అక్షతలును పత్రి పుష్పములును - సలలితముగ దెమ్మి సంతసమున నీవిగా ॥కల॥

వ॥ సుందరీ శివ స్వరూపుడగు యా శైవ పుంగవుని పత్నీ యుక్తము గా పూజించుటకై యర్ఘ్య పాద్యాది వివిధోపచార పరికరంబులం దీసి కొని రమ్మి ఆలస్యంబు వలదు.

సుగ్గు॥ ఇలనాథ పత్రి పుష్పములును జలము గంధముగా ॥ఇల॥ వలు విధముల గూర్చికొనియు బరతెంచిన దాననిదో - విలసితముగ జూడుమటకు వేగ బోదమూ ॥ఇల॥

వ॥ నాథా ఇదో నానావిధంబులగు పత్రి పుష్ప గంధాక్షత జలం బులుంగొని వచ్చినదానను యింకా తడయ నెందుకు యచ్చర పుంగవుని నెదుర్కొందము పదమ్మి.

చి॥ సరెమంచిదటులె బోదమిపుడు సరసిజేక్షణీ ॥సరె॥ మరియు మంగ ళారతులు మీరవగు మంగళ సువాద్య - స్ఫురద మలరవంబు లొప్ప బోవ మేలగుగా ॥సరె॥

వ॥ మనోహారీ మహామంగళ ప్రదంబగు మంగళ వాద్యంబులతో మంగళ హారతులుంగొని యాజ్ఞంగమ వర్యుని పాలికింబోవ మేలగును గదా అట్టులనే మంగళహారతుల యుక్తము రమ్మ పోదము.

సు॥ వరకూర్మవల్లి వాసుడైన గిరిజ నాథునీ ॥వర॥ సరిసమానమైన యట్టి శరణ పుంగవుని తదీయ - తరుణి దరిశనమున మనకు దప్పు నరకముల్॥

వ॥ నాథా పాపదుండు యాపార్వతి పరమేశ్వరుల తుల్యులగు యిచ్చెర్వ దంపతులం దర్శించి పూజించినంత మన పాపంబులు దొగి కైలా సంబుం జేరగలము పదుండు.

చిరు-వ॥ సరి మంచిది రారమ్మ ( అని మాయాజంగమ రూపు డగు పరమేశ్వరుంజేరి ) స్వామీ శైవపుంగవా భవత్పాద పద్మంబుల కిదో ప్రణమిల్లు చున్నవాడ కటాక్షించుడు

పర-వ॥ అహాహా చిరుతొండరాజా వర్ధిల్లుము వర్ధిల్లుము.

చిరు-వ॥ తల్లీ శైవాంగనా మతల్లీ నమస్కరించెదను.

పా-వ॥ రాజా శుభంబగుగాక.

సుగ్గులాదేవి పరమేశ్వరునితో

సు॥ శరణాగ్రిణీ అభివాదనము.

పర-వ॥ సుగ్గులా దేవి శుభంబగుగాక,

సుగ్గులాదేవి పార్వతితో.

సు॥ తల్లీ నమస్కరించెదను.

పా. వ॥ సుగ్గులాదేవి జయంబగుగాక.

చిరుతొండరాజు సుగ్గులాదేవితో

వ॥ మనోహారీ ఇటువినుము.

సుగ్గు-వ॥ మనోహరా యేమిసెలవు.

వాదము - యేక.

చి॥ పూజింతమా - పూబోణి వీరిలిపుడు ॥పూజి॥ రాజీవ పొన్న జాజి పుష్పజాలముచేతం ॥పూజిం॥

వ॥ తరుణీ యిచ్చెర్వ దంపతుల పాదాంభోజముల పూజసేయుదము పత్రి పుష్పంబుల నిటు దెమ్ము.

సు॥ రాజేంద్ర మీ - రనుమాడిక్కి పుష్పములను ॥రా॥ యీరాజంగ మముల పూజ సేయు మిపుడు దెస్తి ॥రా॥

వ॥ నాథా ఇదే పత్రిపుష్పాదులు దెచ్చిన దానను యిమ్మహాదంప తుల పూజించుము.

చి॥ నీరుబోయుమా - వీరిపాద పద్మములను ॥నీరు॥ భూరిగంధా క్షతలు - వేరు వేర జల్లుదిపుడు ॥నీ॥

వ॥ తరుణీ యీదంపతుల పాద పద్మంబులపై జలంబులుం బోయు ము నేను కడిగి తడి యొత్తి గంధ పుష్పాది వస్తువులచే షోడశోపచార పూజలం జేసెదను.

సు॥ వేయు సేయకర్త । ధారుణీశ మీదుయాజ్ఞ ॥ వేరు ॥ కోరిసల్పి యుంటి । ధీరయింకేవిధము తెల్పు ॥వేరు॥

వ॥ నాథా మీరనువిధంబున నే యీ పరమ దంపతుల పాదపద్మం బులపై నీరంబులుం బోసి తదుపరి మీయాజ్ఞకు కోరియున్న దానను యేదో సెలవొసంగుడు.

చి॥ మంగళారతుల్ । మగువయిమ్మ వీరికిపుడు ॥మంగ॥ రంగుమీర దివ్య । బంగరూ పళ్ళెరముతోడ ॥మంగ॥

వ॥ రమణీ కమనీయమగు కనక పాత్రంబున మంగళారతు లీజం గమ దంపతులకొసంగుము మన యింగితంబు లీడేరగలవు.

సు॥ పొంగి మీరనూ । పాలపునకు శ్రీకరూర్జవల్లి ॥పొంగి॥ గంగ ధరుని సాటి । గానలంచి వీరి కెంతు ॥పొంగి॥

వ॥ నాథా మీరను చందంబున నే మొదలి యున్నదానను కట్టా త్తింమడు,

చిరు-వ॥ మంచిది మనోహరీ యీజంగమ దంపతుల పూజజేసి కృతార్థులమైతిమి గాని యింక వీరిపేరు యూరులుం దెలిసికొనియెదగాక నీవిట్లుండుము.

సు వ॥ నాథా అట్లునే అడిగి తెలిసికొనుండు.

చిరు-వ॥ నుంచిది, (అని పరమేశ్వరునితో) అయ్యా శరణాగతిణీ ఇటొకసారి చాయనవి వినుడు.

పర-వ॥ రాజా చెప్పు మనవి.

వాదము - యేక,

చి॥ చరమార్గీ । శరదిందువిశద సత్కీర్తి । భక్తానువర్తి ॥ చర ॥
వరమపావనాత్మ మీరలుండెడు పురమదేదో మీదునామమేదో । సరసము
గను దెల్పు విందు వీనుల కరువుదీర వరమమోదమున ॥చర॥

వ॥ జంగమ వర్యా మీరెల్లప్పుడుండు గ్రామ నామంబేమి మీపే
రేమి నాకొకసారి విన్నవించి నామనంబు సంతోషింప జేయుడు.

పర॥ నరపాలా । వినిపింతు వినము శీల । అనుమానమేల ॥నర॥
పరగ మేము యుండు పట్టణము శ్రీగిరియు నాదు నామధేయమును విను।
మరమరేల మృత్యుంజయుడని బిల్తురు ధరావరేణ్య నిక్కముగ ॥నర॥

వ॥ రాజా మేముండు పట్టణము శ్రీశైలము నా నామాంకితము
మృత్యుంజయుడని యందురు యీ నా సతి నామంబు విశాలియని యం
దురు యీమె తలిదండ్రులా మేనక హిమవంతులుగదా.

చి॥ వరపుణ్యా । సత్కీర్తి జంగమ వరేణ్య । గుణగణ్య ధన్య ॥వ॥
మరియు మీదు గర్భమందు బుట్టిన వర కుమారులెందరో వారి పే । ర్లిర
వుగాను విన్నవించుడిక మీకరయ మిత్రులెవ్వరో తెల్పు ॥వర॥

వ॥ అయ్యా మీ నిజ గర్భంబునందుదయించిన కుమారు లెందరో
వారివారి యభిదానంబు లేమో విన్నవించి మీకెవ్వరైన మిత్రులున్న
దెల్పుడు.

పర॥ నరేమంచీ । దటులె వాత్రుచ్చెదను పొంచి । వినుమాలకించి॥
నరే॥ యిరవుగాను నలుగురాత్మజులు గల రెలమి పుణ్యావర్తనుల్ సజ్జ
నుల్ । నురుబలాఢ్యులెన్న మద్భావ తత్పరులు నాదు మిత్రులు ॥నరే॥

వ॥ నరవరేణ్యా నాకు నలుగురు కుమాళ్ళు గలరు వారలెవ్వరనిన
విఘ్నేశ్వర కుమార వీరభద్ర భైరవులను నామంబులు గలవారు యింక
నన్ను నమ్మినవారే నామిత్రులు నాపాత్రులు.

చి॥ అహహా మీ । వాక్యములు విన్న మరి భూమిచిత్రంబు స్వామి॥
ఆహా॥ సుహితముగను శకటాందోళిక సత్సరు చిరాశ్వమేదియైన లేకను।
సహజముగ యిందురాను మీదగు శరీరంబు నెంతనొచ్చెనో ॥అహా॥

వ॥ అయ్యా శకటమే కాని ఆందోళికమే కాని అశ్వమే కాని యే
దైన నొకదాని పై నెక్కిరాక మీరంత దవ్వునుండి యింతదూర మెంత

ప్రయాస పడుచుంటు వచ్చితిరో కాని తెలియదు మీదేహమెంత నొచ్చె నోకదా.

పర॥ మహీనాథా । నీకీర్తి వినియు గుణయూధ । మహితప్రబోధ ॥మ॥ విహితముగను యింతదూర మెచ్చితి వేల శ్రమలకోర్చి యాయాసమున । మహిని కూర్చపల్లి మందిరుండగు యహి విభూషణుండె తోడుగలడు॥మహి॥

వ॥ రాజేంద్రా నీకీర్తి ప్రభావంబులు విని నాకోర్కె దీర్చెదవని । యెన్నో శ్రమలకోర్చి యెంతో ఆయాస పడుచుంటు । యింతదూర మెచ్చితి వచ్చినందుకు నీభక్తి విశేషంబులుం జూచి నేనెంతో మెచ్చితిని అబ్బా నీవంటి పుణ్యాత్ముండీ లోకంబునం గలడా.

చిరు-వ॥ ఆహాహా మహాత్మా నన్నిట్లు మీరు మెచ్చవలదు నేనెంత నాభక్తియెంత యుండదటి మహానుభావులలో నేనొక కించిన్మాత్రుండను గదా.

పర-వ॥ సరిమంచిది (అని తనలో) యీ చిరుతొండని భక్తి విశేషంబింక పరీక్షించుటకై మచ్ఛరీరంబంత యీకుష్ఠువ్యాధి రోగజనితంబగు పుండ్లలోనుండి యనేకముగా చీము నెత్తురు గురిపించి చూపరుల కసహ్యమగునటుల జేసి కొంత నటించెదగాక (అని పుండ్లలోనుండి నెత్తురుచీము గురిపించినంజూచి)

చిరు-వ॥ ఆహాహా శరణ పుంగవా.

మ॥ వరయోగీంద్ర భవచ్ఛరీరమున యీ ♦ వ్యాధెట్లు సిద్ధించెదు
స్తరమౌపుండ్లను చీము నెత్తురుచు జల్ ♦ దట్టించి పీడింపరో
మరకన్ యీగలు దోమలున్ ముసరినన్ ♦ బాధింప నీవెట్లు యీ
ధరణిన్ తాళితివయ్య నేనెరుగ యి ♦ త్యాదుల్ మరెవ్వారికిన్ ॥

వ॥ అయ్యా యీకుష్ఠువ్యాధి యుగ్రమైన మీకెట్లు సంభవించినది అయ్యో యీపుండ్లు నెత్తురు చీము నీట్లచే బాధింపబడి తత్ప్రత్యణాశ్రయములైన యీగలు దోమలచే పీడింపబడి మీరెట్ల తాళియుంటిరో కాని తెలియదు ఇట్టియవస్థ నేనెవ్వరి యందుంజూడ లేదు.

పర-వ॥ రాజా నేనేమిసేయుదు యీపృథివిలో యీవృద్ధత్వ మొచ్చుటమే కష్టము అందు కీవ్యాధి జన్మించి కంతి గడ్డలు నెత్తురు చీము

గురియుచుండ యీ మశీశాదులచే బాధపడుచుండుట యింక యెంత కష్టము ఇదంత మత్పూర్వార్జిత కృతమే.

వాదము - యేకం.

చి॥ శైవాగ్రణి యీవ్యాధిచేత మీరు। బహు శ్రమ లెల్లననుభవించి చారు ॥శై॥ యేవిధి తాళితిరో కాని యావిరించి మీనొసటను। కేవలముగ నిటులవ్రాసె గానా। మీ భావమేమొ యేను దెలియనైనా ॥శై॥

వ॥ శైవపుంగవా యాబ్రహ్మదేవుండు మీపై పగదలంచి యిట్లు వ్రాసియున్నడు గాబోలు లేనిచో మీకీ ఘోరవస్థ సంభవించునెట్లు అయినా యీ యవస్థ కోర్చి మీరీ దివారాత్రంబెట్లు యేగించుచుంటిరో కాని తెలియదు.

పర॥ భూవర చంద్ర దయాత్మ సత్యశీల। నేనేవిధి వచియింతు సుగుణజాల ॥భూవ॥ గ్రావజపతి కృత్యమొయదిగాక గొప్ప కుటిలమేనో। యీవిధి రాగూర్చినిట్టి వ్యాధి। మరియేవిధంబు దొలగునో యవిరోధి॥

వ॥ రాజా యా యీశ్వరుండొనర్చిన కృత్యమేనో లేక కుటిలమేనో యేదో కాని నాకీ యవస్థయైతే సంభవించినది యీ యవస్థ మాను యుపాయంబేమో కాని తెలియకున్నది మానునో లేదో.

పార్వతితో

చి॥ నాతల్లి యీమహేశ్వరునకీవూ। తగురీతి ఘన యౌషధమిడి లావూ ॥నాత॥ వాతమూన్ప లేకపోతివైతే యీరీతిదగునె। ప్రీతి విడచియుండ సతులకెల్లా। ధర్మాతీతము జెల్లునె పతివల్లా ॥నా॥

వ॥ తల్లీ నీవైన యేదో యొక మంచి యౌషధము బెట్టి నీ భర్తాళుని రుగ్మత మాన్పలేవైతివి ఇదియేమి నిరాక్షిణ్యము పతివ్రతలకిట్లు పతులయెడ నుండ జెల్లదు.

పా॥ భూతలనాథ వరేణ్య వినుము మేము। ప్రఖ్యాతిగనీకీర్తియు విన్నామూ ॥భూ॥ ప్రీతితో నీసులను బ్రోచె దాతవంచు నమ్మి మేము। సీతావున కిప్పుడు వస్తిమిందూ। మరి మాతలపెట్టు జేతువా కనిముందూ॥

వ॥ చిరుతొండరాజా మాకోటి దీనుల పరితాపంబులం దీర్చు పరమ పుణ్యాత్ముండవని నీకీర్తివిని మేమింతదూరం మొచ్చితిమి కాని మా కోర్కెలు దీర్చెదవో లేదో.

పరమేశ్వరునితో

చి॥ శివరూపా మీ మదిలో నున్నయట్టి । కోర్కె విధానంబేమొ తెల్పుడిట్టి ॥శివ॥ ప్రవిమలముగ తేరులశ్వ భటగజంబు లగ్రహార । వివిధ వస్తువులును యేవియైనా । నేఁడొసంగుదు వేడుక యీలోనా ॥శివ॥

మ॥ పరచేలంబులొ మాడలో ఫలములో ♦ వస్త్రంబులో గోవులో
హారులో రత్నములో రథంబులొ వి ♦ శిష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతములొ ♦ గ్రామంబులో భూములో
ధరణీ ఖండమొ కాక యేమడిగెదో ♦ ధాత్రీ సురేంద్రోత్తమా ॥

వ॥ జంగమవర్యా పైజెప్పిన పదార్థంబులలో మీకాకిష్టమైన పదార్థమేదో యడుగుడు తప్పక నేనిచ్చువాడ సంశయ పడవలదు యడుగుడు.

పర॥ అవనీశా యీరథ గజంబులాది । వివిధ వితానము లేలసత్యవాది ॥అవ॥ సవినయమగు అగ్రహార సమితియెల్ల ధనములెల్ల । కవగూడియు కల్ప తరువు జేరి । వత్తికాయ వేడినట్టులాయె భూరి ॥అవ॥

వ॥ రాజా కల్పవృక్షంబునుం జేరి వత్తికాయ నడిగికొనట్లు సకల వాంఛితార్థంబు లొసంగు పరమ పుణ్యుండవగు నిన్ను యీతుచ్ఛమైన పదార్థంబు లడుగుట యింక యీరోగ పీడితుండ నగు నాకీ సకల వైభవంబు లేవియుం బట్టవు.

పార్వతితో

చి॥ లలితాంగి యిటులేల సంశయించా । నీ చెలువుని తలపెట్టి దో యోచించా ॥ల॥ చెలువము నేనట్టి కోర్కె సలలితముగ దీర్తును యిం । దుకు శివుడె సాక్షి భూతుడమ్మా । మీ తలపెద్దియు నైన నొసగుదమ్మా ॥ లలి॥

వ॥ తల్లీ సంశయించెద వెందుకు నీ భర్తాళుని మనంబునంగల కోరిక యెటువంటిదో యడుగుడు నేనిచ్చువాడ ఇందులకా శంకరుడే సాక్షి.

పా॥ ఇలలోనా శ్రీకూర్ణపల్లి వాసు । డగు నలకాక్షుడయైన కృత్తివాసు ॥ఇ॥ తులితుడైన యీ నావిభు ఫలితమునకై నీతయౌషధ మిలనుగోరి కూచట దొరుకకింతా । ఇందులకై వచ్చితిమి నీదు చెంతా॥
మ॥ నరనాథోత్తము యొక్క యౌషధమునకై ♦ నానాప్రదేశంబులున్
దిరిగిందిర్గియు నెట్టిరాజులకు యీ ♦ దివ్యౌషధం బెంతయున్
దొరకంజాలక డస్సినీమ కడకున్ ♦ దోరంబుగన్ వస్తిమిం
దురయంబున్ నదినీతో యానసుచు నేం ♦ తోయాళతో నిప్పుడున్ ॥
వ॥ రాజా మే మొక్క యౌషధంబును గురించి యెన్నోదేశం బులుం దిరిగి యెట్టి రాజులచే నిట్టి కార్యంబు గానేరక విసిగి పేసారి నీవద్దికి వచ్చితిమి గావున యట్టి యౌషధము మాకు నొసంగి మాకో ర్కెదీర్చుము.
చిఱు—వ॥ సరి మంచిది. (అని పరమేశ్వరునితో) మహనీయ జంగమ వర్యా.

వాదము - యేక.

చి॥ అనుమానమును హేలను యికా । నాతండిక్రియీతు ॥ అను ॥ వినజేయుడి యీ ఘనయౌషధ మెం । దున్నను నేజని తెత్తును ॥అను॥
చ॥ శరణవరేణ్య నీమదిలో సంశయ మందక విన్నవించు మే
పరమ సుయౌషధంబో యది పర్వతకానన దుర్గమందులం
దొరయగ నెచ్చటున్నగని దోకియక నేజని తెచ్చియిత్తు నీ
కరయమదీయ వాక్యములయందును దబ్బర లేదునిక్కముగా ॥
వ॥ అయ్యా అనుమానించెద రెందుకు మీరుంగోరు దివ్యౌషధ మెట్టిదో నట్టుం బెట్టక స్పష్టంబుగ విన్నవించుడు అట్టి మందు యెచ్చట నున్నగాని సకల ప్రదేశంబుల న్వెదకించి సంపాదించికొని వచ్చి నీకిచ్చె దను చెప్పుము ఆదెట్టి యౌషధమో.
పర॥ జననాథవిను యీసంధియా । వివరింతు నేడు ॥జన॥ మనుజ మాంసమునుదిన యీ వ్యాధియు । జనునట నదివిశ్వయముగనిప్పు ॥జన॥
క॥ నరనాథ మనుజమాంసము ♦ స్థిరముగ భక్షణము సేయ దీరు నటా యీ ♦ యురుదుగ్ధత యదినా కిపు ♦ దరయగను నొసంగు సత్యమం దభిరతివై ॥

వ॥ రాజా మానవ మాంసంబు దిన్న యీకుష్టవ్యాధి రోగంబు మానునని యొక భిషజ్జనుడు వచించినాడు కావున అందులకై నీవు ధర్మ కంకణ బంధ్ధుండవై యున్నావని నీకీర్తి విని నీవద్దికి వచ్చినారము కావున నీవా నరమాంసంబు నాకుంబెట్టి యిారోగ్యత బొత్తిగ మాన్పుము ఇదియే నాకోరిక ॥

చి॥ ఇదియేమి విపరీతము మిా । జంగమ వరేణ్య । ఇది । పద పడి రుచిగల పక్వాన్నాదులు । బొదంక నిచ్చుటి బిరుదుగలదు ॥ఇది॥

మ॥ పరమాన్నంబును పంచ । భక్ష్యములు బల్ బాగైన లడ్డూలు సుం
దర మాధుర్యములైన బర్ఫి । మొదలౌ దధ్యాన్నముల్ బెట్టు యిా
బిరుదుం గల్గుచుగాని యీ । నరులనిర్భీతిజ్ వడిజ్ జంపి యె
త్తెరగుజ్ నిత్తును నీకుపాపమున । కెంతేనోర్చి శైవోత్తమా ॥

వ॥ శైవపుంగవా నీవడుగునది చిత్రంబుగానున్నది పుట్టిదాతలైన తినువారి కిష్టపదార్థంబులగు పంచ పక్వాన్నంబులాది వివిధ పదార్థంబులు షడ్రసోపేతంబుగా నిడువారున్నారు గాని యీనర మాంసంబు గోరువారిని యిచ్చువారిని నేనెచ్చట జూడలేదు అయినా నీతియుండప్పి హింసకోర్చి పరుల నెవ్వరిం దరిగి నీకొసంగుదును నీవే చెప్పుము.

పర॥ మదిలోననే సంశయమునూ । జెందక వలదిక ॥మది॥ కుదురుగ శివభక్త లేమడిగినను । వదలకిత్తునని వాక్కు నిలుపు ॥మది॥

వ॥ నరవరేణ్యా ముందు నీవుగట్టిన ధర్మ కంకణం బటిదంబు 7. కుండ నీబిరుదు నిలుపుకొమ్ము భక్తులేమడిగిన నదినిత్తునని ప్రతిజ్ఞ గాని లోభ రతుండవై యిప్పుడే నడిగిన దివ్వకున్న యెడల నీబిరుదు నీసత్య వాక్యంబు నిలుచునా తప్పక నాకా నరమాంసంబు బెట్టుము.

చి॥ అయ్యయ్యో యిదెంతన్యాయమూ । శరణాగ్రగణ్య ॥అయ్య॥ నయమానస శివనామాభ్యాసిత । క్రియచర భక్తులకిది తగునే ॥అయ్య॥

వ॥ అయ్యా మిారెల్లప్పుడు శివనామధ్యాన పరాయణులైన చరమూర్తులు అదియునుంగాక లింగపూజ జపతప నిష్ఠాగరిష్టులునగు మీవంటిమహనీయులకీ నరమాంసంబు దిన భాగ్యమానా ఇందులకు మిామను సెట్టు లొప్పెనో కాని తెలియదు ఇది యొక వింతగానే యున్నది.

పర॥ దయావార్ధి కర్నూలపురీశునే । భక్తాగ్రగణ్య ॥దయ॥ ప్రియమొంద
వగ నీబిరుదు నిల్పు ని । శ్చయముగ నీకందియము దీర్తు ।దయ॥

వ॥ ఓహో నరనాయకా ఇదియేలా నీకందియము శివభక్తాగ్రణులకే నరమాంసంబు కూడదని యంటివి కాని ఇందులకేమి దోషంబు లేదు అదెట్లులన గోరోజనము మేషరాయి క్షీరాజ్యము మొదలగు అభక్షణీయ వస్తువులే యౌషధసేవకు యోగ్యంబులైనవి గాని దూషితంబులుగావు అట్లులనే యౌషధ సేవకెట్టి పదార్థంబులైన నెట్టి దోషంబు లేదు విన్నావా నాకా నరమాంసంబు చేతనే యారుగ్మత పోనునుగదా.

చిరుతొండరాజు (తనలో)

వ॥ అయ్యో ఇప్పుడు నాకేటు దోచుతు లేదు నేనేమని ప్రత్యుత్తర మిత్తును యేమియును లేదు ఘటనాఘటన సమర్థుండగు యీశైవపుంగవునకు కోరిన దొసంగుటే మహా మంచిది యొసంగి నాబిరుదు నిలుపుకొనియెదగాక (అని ప్రకాశముగా) అయ్యా మహానీయా.

నాదము - శోక.

చి॥ శరణాగతజన సీవనురీతీ । సలిపెద నికనేడును ఖ్యాతి ॥ శర ॥
మరువకనె నీపురమునను । గల చిరుతనొకని నిదెదరిగియును । వర
గను నీకర్పణ జేతునిపుడె ॥ శర ॥

వ॥ దేవా నీవను విధంబుననే నీకు నరమాంసంబు బెట్టెదను తొండరెందుకు యీపురంబునం గల బాలునొక్కనిని ఖండించి పక్వంబు జేయించి నీకర్పించెదను యొకక్షణంబు తాళుము.

పర॥ నరనాయక పరచిరుతలను । దురితాత్ముల కపటాత్ములను॥
నర॥ మరినే దినమది గోరనుగా నీసరిపుణ్యులదినగోరుదుగా । అకలేకను
నీవటు పక్వించుము ॥నర॥

వ॥ నరవరేణ్యా పరమ పాపాత్ములగు పరశరీరంబులు నాకుం బెట్టవు నీవంటి పుణ్యాత్ముల దరిగి పక్వంచి నాకుం బెట్టుము ఇది నాకిష్టము.

చి॥ పశులభుజింపగ మీరిష్టా । పడకయున్న నిదెనాయిష్టా ॥ పర॥
గరితనిపుడె దరిగియుమీకూ । నేవరి పక్వించిదరు వివేరా । మరియది
గాకను మత్తను వొసగెద ॥పరు॥

వ॥ అయ్యా నరకళేబర మాసంబు మీకిష్టంబు లేనియెడల యిదే నాసతీలలామయగు సుగ్గులాదేవిని ఖండించి పెట్టెదను అట్లుగానియెడల నాశరీరమైన దరిగి పక్వించి యర్పించెదను తొందరెందుకు.

వర॥ ధరకధిపతులగు మీరలుగా । తగదు తరిగి పక్వించగనూ ॥ కరిమదిరినయెముకలు గలుగూ । మీశరీరముల దిన నొల్లతగూ । మరినా బలమింత్రిలేదు గదా ॥ధర॥

వ॥ నరనాథుకా మీయిద్దరు ధరాధిపతులు కావున మీరెట్లు ఖండింప బడుదురు నేనెట్లు భక్షింప బడుదును అటియునంగాక ముదిరిన బొక్కలుగల మీకళేబరంబులు భక్షింప పెద్దమనిషినగు నాచేత నౌనా కాదు మీయిద్దరి దేహంబులు నాకంబట్టవు విన్నావా.

చి॥ అటులైనను నాసుతుగొట్టి । ఆరగింప బెడుదును ఘట్టి ॥ అటు॥ దిటము దప్పబోకను నాదూ । వాక్పటిమ దప్పబోనిక నీదూ । స్ఫుటలెర మగు నీపొట్టతృప్తిగను ॥అటు॥

వ॥ అయ్యా మాసతీపురుషులిద్దరి కళేబరంబులు మీకిష్టము గాని యెడల నాకొక సుకుమార శరీరుండగు కుమారుండు గలడు వానిఖండించి వండించి నీగర్భంబు నిర్భరానందముగా తృప్తిబొందునటుల వడ్డించెద గాక ఇది నీకిష్టమేన.

వర॥ కుటిలరహిత నీమతు దరిగీ । కోరి యొసంగెదవా మరిగీ ॥ కుటి॥ యెటులైనను శ్రీకూర్ణపురీ । నిలయేశు నెదల్లానమ్మియు భూరీ । పటుతరమగు నీప్రతిన దప్పకను ॥కుటి॥

వ॥ రాజా బాగా విచారించుకొనుము నీవాడినమాట దప్పరాదు నిశ్చయముగ నీవు ధర్మకంకణ బద్ధుండవైతివేని సత్య వాగ్ధురంధరుండవైతివేని నీవిప్పుడన్నట్లులనే నీ కుమారునిం దరిగి పక్వించి నాకడుపార భోజనంబు పెట్టుము అట్లుగాదేని ఇప్పుడే కాదనుము నేనెచ్చటికైన బోయెదను.

చిరు॥ వ॥ అహాహా శరణాగ్రగణీ నీబిరుసు మాటలకేను భయంపడి సత్యంబు విడచువాడనని యనుకొంటివా యేమిం కాదు కాదు ఇటువినుము.

చ॥ కులగిరులేడు డొల్లినను ♦ కుంభిని గ్రుంకిన చంద్రభాస్కరుల్
వలనగు త్రోవ దప్పినను ♦ వహ్నిశిఖల్ చలువైన చుక్కలు॥

జలజల భూమి వ్రాలినను ♦ సత్యము దప్పక మత్కుమారునిన్
వెలయగ ద్రుంచి వండియును ♦ వేగ నొసంగెద శైవ సత్తమా ॥

వ॥ దేవా యెన్నియైన నేనబద్ధంబులాడువాడ గాను నిజంబుగ నాకుమారునిం దునిమి పక్వంబు గావించి నీపొట్టతృప్తిం జేసెదను యిక నీమది తొందరమాని ఆనందంబుగ నుండుము.

వర-వ॥ అహాహా రాజేంద్రా నీ సత్యవాక్పరిపాలనకు నీబిరుదు కంకణముకు నీ భక్తి విశేషంబునకు నేనెంతో సంతోషించినాను ఇప్పుడుగదా నామది యానందించినది విన్నా పరమేశ్వరుండే రక్షించుగాక కాని నిజంబుగ నీపుత్రు నొసంగెదవా.

చిరు వ॥ అయ్యా యేయీ మాటలెందుకు నిజంబుగ నాపుత్రుని ఖండించి నీకర్పించెదను ఇది ముమ్మాటికి సత్యమని నమ్ముము.

వర-వ॥ మంచిది అట్లయైన నేనొకటి జెప్పెద నిటు వినుము.

సీ॥ నరనాథ వినునీదు నందను స్నానంబు ♦ జేయించి కన్నీరుదీయ
కోక ♦ భక్తినా యొడనుంచి బాలుని ఖండించి ♦ మెత్తనిమాంసంబు కత్తి
దరిగి ♦ మిరియాలు జిలకర మేటి పిప్పలి శొంఠి ♦ దాచిన చెక్కయు
ద్రాక్షపండ్లు ♦ ఖురసానివామ నాగరసాల విశాల ♦ నీల గోఘృతమున
లీల చమరి ♦ మరియు పరిశుద్ధతను పాక మమర జేసి ♦ వెలితి యించుక
లేకుండ విందు సేయ ♦ వ్యాధిమానును తుదనీకు వచ్చుముక్తి ♦ యామము
లు రెండు వెళ్ళిన నదియు నొల్ల ॥

వ॥ రాజా పైజెప్పిన విధంబున నాయా మసాలంగూర్చి సినుతుని ఖండించి మెత్తని మాంసంబు వండించి నాకడుపార నీ వారగింప బెట్టితి. వేని నాకీవ్యాధి మానును నీకా కైలాసంబు దొరుకును ఇందులకేమి సంశయములేదు కాని రెండుఝాములు వెళ్ళిన నీవిందు బట్టదు నీపొందు బట్టదు విన్నావా జాగ్రతసుమా.

చిరు-వ॥ అయ్యా ఇటువినుడు.

ఉ॥ స్వామి మరేమిచింత నిటు ♦ సేయక సూను వధించి పిప్పలీ
వామ మసాల జీరకయు ♦ నొక్కట మర్దన జేసి గోఘృత
స్తోమ సమన్వితంబు ♦ పరిశుద్ధత పాకము జేసి నేటి ద్వి
యామములోన మీకుతగ ♦ నర్పణ జేతును స్నానమాడుడీ ॥

వ॥ అయ్యా యెందుకు తొందర మీరనట్టు లనే నానావిధ మసాల లంగూర్చి గోఘృతంబుచే మత్కుమారుని మాంసంబు వండించి రెండు యామములలోగానే మీకర్పించెదను మీరైతే స్నాన సంధ్యాది సత్క్రియలం దీర్చికొనుడు.

పర-వ॥ మంచిది నరనాయకా నీవాడిన మాట మాత్రమును తప్ప గూడదు సుమా జాగ్రత నేనిదే నదికింబోయి స్నానంబుజేసి వచ్చెదను త్వరపడుము.

చిరు-వ॥ అయ్యా అట్టులనే స్నానమాడిరండు శీఘ్రంబున నేసిద్ధంబు జేయించెదను.

పర-వ॥ సరి నేనిదే పోయివచ్చెదను.

చిరు-వ॥ పోయిరండు స్వామి (అని నిష్క్రమింతురు)

పార్వతి పరమేశ్వరునితో

వ॥ అహాహా మనోహరా పరమేశ్వరా ఇటొకసారి నామనవి వినుడు.

పర-వ॥ గిరిజా యేమి మనవి.

వాదము - యేక.

పా॥ స్మరహార వినుము చిరుతొండ రేడు ॥స్మ॥ రేడూ। వాడూ। నేడూ। చూడూ ॥స్మ॥ పరికింపగ నతడు సుతుని దరిగియు మనకిడునో లేదో । మరిదెల్పుడి యుత్తరగును ॥స్మర॥

వ॥ దేవా చిరుతొండరాజు కుమారుని ఖండించి వండి పెట్టుమని నీవడిగినందున వాడొప్పుకొనెనా లేదా వొకవేళ నొప్పుకొనినను కన్న కొడుకును ఖండించి మనకిడునో లేదో ఇందులకై నామది తడబడుచున్నదిగదా.

పర॥ గిరిసుత వినుము వివరింతువేగ ॥గిరి। వేగా। ముగా। బాగాయిగా ॥గిరి॥ చిరుతొండడు సుతుని దగి యూరలేక నొసంగుదనియె। త్వరనాతడు తప్పడు నుడి ॥గిరి॥

వ॥ గిరిజా నేనా చిరుతొండని యడిగినంతలో కొడుకును తడయక నడిదంబుచే నరికి పరిపాకంబు జేసి యొసంగెదనని వాగ్దాన మొసంగినాడు కావున వాడబద్ధ మాడువాడు కాడు తప్పక నప్పని జేసియేతీరును.

పా॥ విడిచెను మోహభ్రాంతియు కొడుకుపైనీ ॥విడి॥ పైనీ । పూనీ । వానీ । తోనీ ॥విడి॥ పుడమిలో నవ్వానిబోలు పురుషునెందు గాననైతి । కడు చిత్రంబిదిగద మరి ॥విడి॥

వ॥ నాథా ఇట్టి చిత్రంబీ లోకంబునం దెచ్చట గాననైతిని పుణ్యంబున కొడిగట్టి పుత్రమోహంబు విడచి తన పుత్రునిఖండించి వక్వంచి పారణ జేసెనని మీతో ప్రతిన బూనినదు అబ్బా వాడెంతసాహసి.

పద॥ పడతి మదీయ భక్తులె యిట్టివారు ॥పడ॥ వారూ । వేరూ । లేరూ । చారూ ॥పడ॥ కడు వేడుకతోడ ముజ్జగంబు లేకమైనగాని । చిడి ముడిపడి నడునడుగరు ॥పడ॥

వ॥ కాంతా మాని మద్భృత్యుల సాహసంబు నీకిప్పుడుం దెలిసెనా యెన్నియైన యీ ముల్లోకంబు లేకమైన వారాడినమాట దప్పరు. అబ్బా వారి మహిమాతిశయంబులెన్న ద్రుహిణాదుల తరంబుగాదు.

పా॥ అటులయినను మనము వచ్చుకార్య ॥మటు॥ కార్యా । మార్యా । ధుర్యా । శ్చర్యా ॥మటు॥ యెటులనుకొనసాగును వీడటుల బొంకు సుతుకైనను । దిటముగ నర్పింతుననెను ॥అటు॥

వ॥ నాథా ఇగ నెట్ల మనము వచ్చిన కార్యంబు నిర్విఘ్నంబుగా కొనసాగటయే లేదు అదెట్టులన కొడుకును ఖండించి పెట్టుమన్నను పెట్టెదనని యొప్పుకొనెను యిక వీడు యబద్ధమాడుటెట్లు వీనితో మన మబద్ధ మాడించుటెట్లు ఇదియంతయు కల్ల ముందటి విచారమేదో యూరయుడు.

పద॥ స్ఫుటతరమయిన వరకూర్ణపల్లీ ॥స్ఫు॥ పల్లీ । యల్లీ । బిల్లీ । వెల్లీ ॥స్ఫు॥ వటు గేహమునందు నిలచి ప్రబలియుండ మీభక్తుని । నిట బొంకగ జేయుట నెటో ॥స్ఫు॥

వ॥ గిరిజా యెట్టులైన వీనితో నబద్ధ మాడించుట మసాధ్యము గానే యున్నది కానికాని యింకా ప్రయత్నించి చూతము.

పార్వ-వ॥ మనోహరా యీ చిరుతొండని కీర్తి ప్రభావ భక్తి విశేషంబులెల్లం గని నామది సంతోషంబాయను గాని వీనికన్నారుండగు సిరియాళుని భక్తి యెటువంటిదో తెలిసికొన వలయునుగదా.

పర-వ॥ గిరిజా ఇది సొంతవెర్రి పులికి జన్మించిన శిశువు పులియే యగునుగాని నీచమృగంబగునా అయినా నీకట్టి యిచ్ఛ యున్నయెడల నేనా పాతశాలకుంజని సిరియాళుని భక్తిం దెలిసికొని వచ్చెదను అంత పర్యంతరము నీవిచ్చొనేయుండుము.

పా-వ॥ మంచిది నాథా అట్టులనే పోయిరండు నేనిచ్చటనే యుండెదను.

వ॥ గిరిజా నేనిదే పోయెదను (అని తనలో) ఓహోహో నే నీ కుష్టువ్యాధి రూపకంబునం బోవలదు మారువేషంబునంబోయి వాని చమత్కృతి జూచి వచ్చెదగాక (అని మారువేషంబునం బోయినం జూచి

సిరి-వ॥ అయ్యా శరణాగ్రణీ మీపాదపద్మంబుల కిదో ప్రణమిల్లు చున్నవాడ కటాక్షించి మీరిందు వచ్చిన కారణంబేమో శ్రుతపరచుడు.

పర-వ॥ ఆహాహా బాలకా వర్ధిల్లుము వర్ధిల్లుము పరమ భక్తాగ్రేసరుండగు చిరుతొండ మహారాజు కుమారుండవగు సిరియాళుండ వీవేనా,

సిరి-వ॥ అవునుగదా స్వామి,

పర-వ॥ అయ్యో కొడుకా నిన్ను జూచిన,నామది కాహ్లాదంబగు చున్నది నే వచ్చినవార్త నీతో నేనేమని చెప్పుదు.

సిరి-వ॥ అయ్యా, దాచవలదు అది యేదో నిజంబుగ జెప్పుడు నే వినియెదను,

పర-వ॥ మంచిది అట్టులైన చెప్పెద నిటువినుము,

వాదము - జుల్వా.

పర॥ చిరుతొండ కుమార। హే సిరియాళ సుధీరా ॥చిరు॥ మరి నీవాక పాటుజెంద వలసెను యీనాదినమందున ॥చిరు॥

వ॥ సిరియాళా లేనిపోనిదొక సంకటము నీకు ప్రాప్తించి వచ్చెను గదా అది నీతో జెప్పుటకు నా నోరాడకున్నది యేమని చెప్పుదు.

సిరి॥ శరణాగ్రణి నీవు। సంశయము జెందెదావూ ॥శర॥ విరివిగ నామచ్చలేదో విన్నవించు మిక దయతో. ॥శర॥

వ॥ అయ్యా సంశయించెద రెందుకు విన్నమాటవిన్నవించుట కింత తాపమా అదెట్టి సంకటమో నిస్సందేహముగా వచియించుము నే వినియెదను,

పర॥ పరగ నీదుతండ్రి । యొకభక్తునికి నిమంత్రి ॥పర॥ తెరిగియు వక్కాణించి పెదుదు సిరియాళుని సటంచు దలచె ॥పర॥

వ॥ బాలకా యెవరో యొక వృద్ధజంగమయ్య వచ్చి నరమాంసంబు గావలెనని యడిగినందున మీతండ్రి నిన్ను ఖండించి వండించి పెట్టెదనని వాగ్దానమొసంగినాడు కావున ఇదెంత అన్యాయము కన్న కొడుకులయందింత కాఠిన్యంబు తండ్రులకుం దగునా ఇట్టివింత నేనెచ్చట జూడలేదు.

సిరి॥ నరవరుండుతాను । యీకరణి శైవునకును ॥నర॥ మరినన్ను నివ నతడుమెచ్చు వర కైవల్యంబు వచ్చు ॥నర॥

వ॥ అయ్యా నన్నాజంగమయ్య కిత్తునని మాయయ్య యొప్పుకొన్నడా ఆహాహా యెంత సుదినము నన్నా శైవున కర్పించిన నాతం డొప్పుకొని మదీయ పలలంబనుభవించుటం జేసి మత్పూర్వార్జిత దోష పుంజంబులెల్లంబాసి నిత్య ముక్తింబొందెదగాక ఇంతకంటె మేలేమున్నది.

పర॥ సరెసరెనీజ్ఞాన । మేనరసితి గుణజాణా ॥సరె॥ మరియును నీవొక్క-క్షణము నురుగునుండ సుఖయించెవు ॥సరె॥

వ॥ బాలకా ఇదియేమి విజ్ఞానము యెంతవారికైన ప్రాణాపేక్ష గుప్పెడుగదా కావున నీవొ యొకక్షణము యెచ్చటికైన బోయి దాగుండుము దాగుండిన ముందు చాలా సౌఖ్యపడగలవు బాలుండవు గదా,

సిరి॥ ధరణియందుపూర్ణ । పురి ధామని పరిపూర్ణా ॥ధర॥ కరుణ గలదు మీదట యీకరణి బలుక భావ్యమానె ॥ధర॥

కం॥ తనువస్థిరమని పెద్దలు ♦ మును జెప్పగ వినమెయిట్టి మోహాంధులమై ♦ ఘన వరక కూపమున బడి ♦ నను మేలే మతనికర్పణమె మోక్షదమా ॥

వ॥ అయ్యా అస్థిరంబైన యీశరీరంబును నమ్మి మోక్ష మార్గంబునుం గిగనాడుట గూబ వెలుతురుంగని చీకటి గవయం జొచ్చునట్లున్నది నీవిచారము యేలా యీ కించిద్భోగ సంసార వ్యాపారంబులు నన్నా శైవున కర్పించుటమేమంచిది. నేనాతని కర్పణమౌటమే మంచిది నేనాతని యందులో సందేహ మేమియును లేదు భయమేమున్నది మరగున కేగిన ఫలమేమున్నది.

పర-వ॥ అయ్యో బాలకా నీవెంత అమాయకుడవు ప్రాణంబుల కంటె తీపే లేదని నీవెరుంగవా మెరింగి కన్నవారలే యింత కఠినులై నిన్నా కైవున కర్పించిన నీవెట్లొప్పుకొనియెదవు ఇదెంత అజ్ఞానము పాణి ణంబు లుండిన బలుసాకులైన యేరుకతిని బ్రతుకవచ్చునను లోకోక్తిని వినవా కావున నీవీ యొక్క తణంబు యొచ్చటనైన దాగుండి ప్రాణం బుల గాపాడుకొమ్మ సుఖించెదవు.

సిరి-వ॥ అయ్యో ఇదియేనా మీ సద్బోధ.

వాదము - యేక.

సిరి॥ శరణాగత్రిణి నీవి । కరణి వచించగ వెరపేలను నాకికను భువి । శర ॥ అరయ జననమే మరణంబని గు । రెరిగి యరుగనది మరి దప్పునె । శర ॥

వ॥ అయ్యో జాతస్య మరణంధృవం బను శాస్త్రోక్తిని వినవా కావున యిట్టి యశాశ్వతమైన దేహంబును నమ్మి సత్యంబు విడనాడుట ధర్మంబు గాదు యెన్నటికైన మృత్యువు దప్పదు గదా దాగుండిన తప్పునా యేలా మీవిచారము మాతండ్రి యనుమతి విధంబున నే మెదిలెద గాక భయమేమున్నది.

పర॥ అరెరరె నీకింతా । స్థిర చిత్తము నిత్తరి గలుగుట చిత్రమిదంతా ॥ఆరె॥ మరుసుందరసి దరుగు నెరిగి యి । త్తరి వచింప వినవుర కఠినుడ ॥వరె॥

వ॥ బాలకా యెంత కఠినుండవు నేనెంత జెప్పిన వినజాల కున్న వుగదా మహా చక్కని శరీరంబుగల నిన్ను మీతలిదండ్రులు మక్కువలేక చక్కచక్కన నరికి యబ్బక్క జంగమున కర్పింతురన్న మాటవిన ఘోష నిమించి నీతో జెప్పిన పెడచెవున జెట్టెద విదియెంత మూర్ఖము నీవీ యొక్క దినము తప్పించితినే బాగుండునుగదా.

సిరి॥ పరచేతుల్లా జచ్చి । నరకము పాలై పొరలుటేల నాకును హెచ్చి ॥వర॥ మరియా జనకుని కరమున దెగి శం । కరార్పణ మయిన దొరుకు ముక్తి ॥వర॥

వ॥ అయ్యో పరహస్తంబునం జిక్కి మరణించి నక్కకుక్కల పాలై వ్యర్థంబగు యీ దేహంబు కన్న మజ్జనకుని హస్తంబునందెగి చర

లింగార్పితంబై సంగరహితంబగు మోక్షంబు గందును ఇంతకంటె మేలే మున్నది.

పర॥ స్మరసుందర వినునీ । గురుడిటు జేయగ మరిమెటు లొప్పె నో నీజననీ ॥స్మర॥ ఆరయ జీవులందరికిని ప్రాణమె । మరితీవని గుర్తెరుగ వైతి ॥స్మర॥

వ॥ సిరియాలా నీజనకుండు కఠినుండైనచో మీతల్లికైన ప్రేమ యుండగూడదా వారలిద్దరిల్లే నీయందు కాఠిన్యంబు దలంచి నిన్ను వధించ నెంచి యున్నారు అట్లైనచో నీకైన జ్ఞానముండ గూడదా యిట్టినైన జ్ఞానము దెచ్చుకొని నేనన్నరీతిగ మెచ్చుటికైన బోయి యీదినంబు గడుపుము.

సిరి॥ మనుపే యీమోహా । మును వధించి వ్రతమును జేయగ బూనితి మహాహా ॥మను॥ అనయము సత్యంబును వదలిన స । జ్జనములు గని మనమున నవ్వరె ॥మనుపే॥

వ॥ అయ్యా యీషణత్రయ కామ్యాది విషయాదులం జయించి యీవ్రతంబు జేయ నుపక్రమించిన మాకీ మోహాంధకార మెక్కడిది మళ్ళి యీమోహంబునం బడి వ్రతనేమంబును విడిచిన మమ్మెంగని మహాత్ములెంత హాస్యంబు జేసెదరు కావున యీశ్వర మాయా కల్పంబున బడిన నేమి లాభమున్నది మాతండ్రి యొప్పినదే మంచిస్థితి యీదేహ మాశైవున కర్పించుటమే మోక్షగతి.

పర॥ జననాయక సుత నీ । కును యీసద్భక్తిని జనించ మెచ్చితి నవని ॥జన॥ అనువొందగ కూర్ణపల్లి శంకరు । డును విమ్మెప్పుడు మనుచు గదా ॥జన॥

వ॥ అహహా సిరియాలా నీభక్తి విశేషంబును మీతండ్రి ధర్మవ్రతిజ్ఞయు మీతల్లి నిష్ఠయు యీ ముజ్జగంబులో వెలసి కీర్తి వహించుగాక నేనిదే పోయి వచ్చెదను.

సిరి-వ॥ అయ్యా పోయిరండు నమస్కరించెదను

పర-వ॥ వత్సా శుభంబగుగాక. ( అని నిష్క్రమింతురు )

పార్వతి పరమేశ్వరునితో

వ॥ మనోహరా పరమేశ్వరా మీరు బోయివచ్చిన కార్యమంత క్షేమమేకదా సిరియాలు డేమన్నడు.

పర-వ॥ తరుణీ గిరిజా చెప్పెద నిటువినుము.

వాదము - యేక.

పర॥ తరుణీమణి వినగదె యాసిరియాలుని వృత్తము సత్వరగ నూ ॥తరు॥ త్వరగను యేర్పరతును యిత్తరి సంశయ మందకనీకు రయంబున మురి పంబున ॥తరు॥

వ॥ పార్వతీ యాసిరియాలుని వృత్తాంత మంత విన్నవించెద కర్ణానందంబుగా వినుము.

పా॥ పరమేశ్వర యెట్టిదో యాచిరుతని వృత్తాంతము నేడరయగ॥ పర॥ అరయగ । మది దొరయగ । తొందరగను నాతోడను శృతపర చుడి దయదలంచుడి ప్రియ ॥పర॥

వ॥ నాథా యచ్ఛిరియాలుని యుదంతంబెమో నీవడిగినదేదో నిజంబుగ శృతపరచుడు.

పర॥ బాలా నీజనకుడు యొక శీలుడు శైవునకును నిన్నోలియు ॥ బాలా॥ వోలియు । దయ మాలియు । యీలీల దృంచి యిత్తుననియు నీలోదలచి నడటంటి ॥బాలా॥

వ॥ గిరిజా నేనా సిరియాలునిం జేరి యన్నమాటిది గదా ఒకే బాలకా మీతండ్రియగు చిరుతొండరాజు యెవడో యొక వృద్ధజంగమయ్యై వచ్చి నరమాంసంబు గావలెనని యడిగినందున మతుమారుండగు సిరియాలుని ఖండించి పక్వంబు జేయించి పెట్టెదనని యొప్పుకున్నాడు కావున నీవీయొక్క దినంబు దప్పించిన బాగుండునని యెన్నో విధంబుల బోధించితిని గదా.

పా॥ యీలీలను మీరు బలుక యేలీలను బలికెను యాబాలుడు ॥ యీలీ॥ బాలుడు । సిరియాళుడు । గుణశీల నాతో విన్నవించు మీలో సంశయములేక ॥యీలీ॥

వ॥ మనోహరా మీరివాక్యంబు జెప్పినంతలో యాసిరియాళుండు విని యేమన్నాడు,

పర॥ దేవా మాజనకుడు యాశైవ పుంగవునకును నన్నీవగ ॥దేవా॥ యీవగ । నాకేవగ । యును యీవేళను లేదు...కు కైవల్యముదొరుకు ననియె ॥దేవా॥

వ॥ గిరిజా నే నీమాట యన్నతోడనే నిశ్చయముగ మాతండ్రి యాజంగమయ్యకు నన్నివ్వ దలంచినచో నా భాగ్యమెంతదొడ్డది పర హస్తంబున హింసింపంబడి మృతకళేబరంబు నక్కకుక్కల పాలై పోవుటకన్న మాతండ్రిచే ద్రుంచంబడి యుత్తమ జంగమ గర్భంబునంబడి లింగార్పింబగు మద్దేహంబు పునర్జన్మ రహితంబగు మోక్షంబునుం జెందును గాని నరకంబునుం జెందదు ఇందులకై తొందరెందుకు మా తండ్రి యోచనయే మంచిది అని యీాషణత్రియాదులం జయించి వ్రతం బుబూనిన మాకీ మోహాలత యెక్కడిదని వాక్రుచ్చినాడు గదా,

పా॥ కోవిదనుత కార్ణవల్లి దేవనీకు భక్తుల సద్భావము ॥ కోవి ॥ భావము । సుఖజీవము మరిహావిరించి ప్రముఖులైన యభివర్ణింపంగ గలరె ॥కోవి॥

వ॥ నాథా నీభక్తుల మహిమాతిశయంబులెన్న దుహిణాదుల తరంబుగాదు మాబోటి యబలల కగునే దేవా మహానుభావ,

పర-వ॥ గిరిజా భక్తపరాధీనుండనై భక్తిలతలచే కట్టుబడి తద్భక్తవితానంబు వెంత నిర్లజ్జుండనై సంచరించు చుండుదు అందుకే నాకంటె యధికులు నాభక్తవరులు అను గీతప్రమాణంబుగ నీతో నెన్నో పర్యాయములు శృతపరచు చుంటినిగదా అయినా యెన్ని విధంబులైన నాభక్తులబద్ధంబు లాడువారుగారు మంచిది ఆవట్లుండనిమ్మా మనమా చిరుతొండని నియుక్తి ననుసంచరించి మిగల వలయును కావున యీారమ్యమగు స్థలంబున వసింతము రమ్మా.

పార్వ-వ॥ మంచిది మనోహరా అట్లులనే వసింతము పమ్మా ( అని నిష్క్రమింతురు )

చిరుతొండరాజు ( తనలో )

వ॥ అహా నేనా వృద్ధమహేశ్వరునకు రెండు యామములలో నాసూనునిం జరిగి పక్వించి పెట్టెదనని యభయం బొసంగితి ఇందుల కా సమయము మీరునో యేమో యని నాడెందంబునకు భయంబగు చున్నది గదా ( అని మంత్రితో ప్రకాశముగా ) మంత్రీ ఇటొకసారి వినుము.

మంత్రి-వ॥ రాజా యేమి సమాచారము.

వాదము - జుల్వ.

చి॥ వినుమికవో మంత్రివర్య విన్నవింతు విశదముగా । మనుజమాం సమెట్లు శైవ ఘనుడుగోరె ననిశముగా ॥విను॥

వ॥ మంత్రీ యాశైవ పుంగవుడే నర మాంసంబు నౌషధంబుగా గోరెను కావున ఇట్టివింత నేనెన్నడెరుగను గదా.

మం॥ మనుజనాధ మున్నెవరిట్లనగ వినగ లేదుగా । అనఘుచితో నేమని మీరును వొప్పితిరో తగా ॥మను॥

వ॥ రాజా ఇట్లాటిమచ్చట నేనెన్నడు వినలేదు గాని మీరా శైవునితో నేమని యొప్పుకున్నారో చెప్పుడు.

చి॥ అడిగినట్టి భిక్షమంచు నభయమే నొసంగితి । యడిగినకొడుకు మాంసభిక్ష మిడుమన నేభీతి ॥అడి॥

వ॥ మంత్రీ నేనా శైవపుంగవునకు అడిగిన పదార్థం బిచ్చెదనని యభయం బొసంగి నందున నీసూనుని వధించి తన్మాంసంబు వండించి నాకుబెట్టిన నాకీ వ్యాధి మానునని వేడినందున నేనాతనికి మత్పుత్రుని ఖండించి పెట్టెదనని యొప్పుకుంటిని గదా.

మం॥ పుడమిలో నెవరైన యిట్లు పుత్రుని వధియించియూ । యిడినవారు లేరు నీవెట్లిడితివి మదినెంచియూ ॥పుడ॥

వ॥ నరవరేణ్యా ఇట్లు కన్నపుత్రుని ఖండించి పెట్టినవారిని నేనెన్నడు జూడలేదు నీవెట్లు లీవునికియ్య కొంటివో గాని తెలియదు.

చి॥ ఇదివిని నాసతి యేమని మదిగుందే మనునో కో. పదపడి నాపుత్రు డిట్టి పనికొప్పునో లేదో కో ॥ఇది॥

వ॥ మంత్రి యీవిచారంబు విన్నతోడనే మత్కులకాంతయగు సుగుణాదేవి నన్నేమని దూరునో కదా అదియునుం గాక ఇట్టి ఘోరకృత్యంబున కాసిరియాలుం డొప్పునో లేదో యొప్పుకున్న నేమిగతి,

మం॥ కుదురుగ శ్రీకూర్ణపల్లి మదనారియె గలడికా । వదలక మీ కృత్యమెంచ వరచిత్రించె యికా ॥కుదు॥

శా॥ క్రూరుండైనను కుత్సితుండయిన • బిల్ గ్రుడ్డైన కుంటైన దుః
ప్రారంభుండయినన్ సకల్మషు • మనఃప్రాదుర్భవుండైనని

పాకారుణ్యంబున పుత్రుఁజూపు • సతతిం గానంగ లేదెయ్యడన్
మీారెట్లీ సుకుమారు సద్గుణుని • భూమీంజవ యత్నిస్తిరో. ॥

వ॥ నరనాయకా యెట్టి దుర్మార్గుండైనను యెట్టి కకఠినగుడై నను కన్నకొడుకుం ద్రుంచు వారున్నరా నీవీ నాపుడు నిపాకారుణ్యంబున మహా సుకుమార శరీరుండగు కుమారుని వధించ యత్నించి యున్నవైతే యిట్టి విచిత్రం జెప్పుట గానము.

చిరు-వ॥ మంత్రీ యెంటిదోచక సేనాశరణాగణి కభయం బిచ్చితి యిచ్చినందులకు చింతించిన నేమిలాభము ఇందులకా సర్వేశ్వరుండగు శంకరుడే గలడు.

మం-వ॥ అవును సర్వభారకర్తయగు శివుడే దిక్కు గాని యెవ్వరేని యర్థులు ధనకనక వస్తువాహనాది ద్రవ్యంబు లడుగుదు రుగాని ఇట్లు నరమాంసంబు భిక్షగానడిగిన యర్థిని నే నెందు జూడలేదు ఇది యొకచిత్రంబుగానే యున్నది యీయటీల జంగముని విచారము.

చిరు వ॥ మంత్రీ గడచినదానికి విడికిన నేమిలాభము యీవార్తా మత్కుల కాంతయగు సుగ్గులాదేవికి విన్నవించవలయు దానినొక్కసారి యిందు రావించుము.

మం-వ॥ రాజన్ మీవాక్యంబు విన్నంతమాత్రంబుననే ఇదే సుగ్గులాదేవి వచ్చుచున్నది యేదో ముందటి విచార మరయుడు.

చిరు వ॥ మంచిది రానిమ్ము. ( అని అనునంతలో )

సుగ్గులాదేవి ప్రవేశించి

వ॥ నాథా నమస్కరించెదను నన్నింతల కిందు తొందరగా రావించితిరో శృతపరచుడు.

చిరు-వ॥ నారీ నిన్ను రావించిన కారణం బిదిగదా యీశైవపుంగవుడు నరమాంసంబు గోరిన నేనొప్పుకుంటిని ఇందుకొరకే నిన్ను రావించి విచారించు చుంటినిగదా.

వ॥ అహహా ప్రాణవల్లభా అట్టులైన నేమితొందర ఇటువినుడు.

వాదము - యేక.

వి॥ హృదయేశా । మరినేమి తొందరమో ॥హృద॥ విదితముగను శైవుడిట్లు గోరిన । బెదరు జెందుటేల నానుదేహము । పదపడియును నిత్తు గొనియు నాతని హృదయమిపుడు తృప్తి జేయుము ఇక వో ॥హృద॥

వ॥ నాథా ఇందులకిట్లేల తొందర పడుచుంటిరా యేమి వద్దు వద్దు ఇదే నాకళేబరం బర్పించు చున్నదాన దీనిచే యచ్చరణ పుంగవుని మనోతృప్తిం జేయుండు భయమేమి.

చి॥ మదనాంగీ । వినుమిందు శేఖరునివో ॥మద॥ సదయ హృదయు డైన వృద్ధ జంగము డెడలా నీదునాదు దేహములుబల్ । ముదురటంచు దినగ జాలనని తామదిని గోరడాయె మనలనికవో ॥మద॥

వ॥ తరుణీ ముందే యీచందంబున వచించి నాడను అందుల కాతడు మీయిద్దరి శరీరంబులు ముదిరిన యెముకలు గలవు తినుటకు సహింపను బలహీనుండనగు పెద్దమనిషిని గదాయని యున్నాడు గదా.

సు॥ అటులైనా । వారిమీరలెవ్వరినీ ॥అటు॥ వటుతరముగ నిత్తు నంటిరిక వాక్పటిమ మెరయ విన్నవించుడికయా । జటులుడేమి యడిగె నాతని మనంబెటుల తృప్తిజేయనెంచితిరిమీ ॥రటు॥

వ॥ నాథా యీమాట కతడొప్పక మళ్ళి మిమ్మేమడిగినడు మీ రెవ్వరినిత్తునని యొప్పుకున్నారు యవ్విధంబంత విన్నవించుడు నే విని యెదను.

చి॥ అటువంటీ । వాక్యంబు నేనును నీ ॥కటు॥ యెటులవిన్నవింతు నామదికీ యీ కెటుల దోచదట్టి వార్తయును జె । ప్పటకునాదు నోరునాడ కున్నది కటకటా మరేమి, సేయుదును నే ॥నటు॥

వ॥ మనోహారీ అట్టివార్త జెప్పుటకు నామది ధైర్యంబు జాల కున్నది నేనేమని చెప్పుదు నోరాడకున్నది గదా.

సు॥ మనుకేంద్రా ఇటులేల చింతిలవో ॥మను॥ అనినమాట జెప్ప రాద మీనోటను వినగగోరియున్నదానను । ఘన విషాద మొంది సంశయించెద రనఘ యెందుకయ్యా నిక్కముగవో ॥మను॥

వ॥ నాథా సంశయించెదరెందుకు మీరొప్పుకున్నమాట వొక్కటే వరి చెప్పరాదా నేవినియెదను,

చి॥ అనుమానా । మికయేల వో తరుణీ ॥అను॥ వినుము మనదు సుతుడు మైన సిరియాళుని వధించి పక్వమిందు జేసియు। ననఘునీకు నిడుదు నంచు శైవునకును సువాక్కు దత్త మిచ్చితిని నే ॥దను॥

వ॥ తరుణీ మన యిర్వురి శరీరంబులు తనకు బట్టవని యన్నందున అతి సుకుమార శరీరంబుగల మత్కుమారుండగు సిరియాళుని ఖండించి తత్పలలంబున నీమనోతృప్తిం జేసెదనని యాశైవునకభయంబిచ్చితిని ఇది తప్పిన బాగుండునా,

సం॥ నిజమేనా । ఇవుడన్నమాటయునూ ॥నిజ॥ గజిబిజేమి లేక మీరు పొరపాటు జనియించి బలుకుచుంటిరో యే । మొజరిగినదియంత నిక్కవంబుగ సుజనవంద్య నాతో జెప్పరాదా ॥నిజ॥

వ॥ నాథా ఇవ్వుడు మీరన్నమాట నిజమేనా లేక పొరపాటునం బలికితిరా వున్నదున్నట్లు వాక్కాణించుడు నామది భయంబగుచున్నది గదా.

చి॥ గజయానా । యీమాట నిశ్చయమూ ॥గజ॥ వృజినదూరుడైన కూర్ణపురి మారజిత తుల్యుడైన శైవునకునా । నిజకుమారు నిత్తునంటి విను మండజ సుగామి డబ్బరల్ గావువో ॥గజ॥

వ॥ మనోహారీ నేనన్నమాట నిజమే తప్పక మత్కుమారుని వధించి వండిపెట్టెదనని యమ్మహేశ్వరునితో నొప్పుకుంటిని ఇది యబద్ధంబుగాదు.

తుగ్గులాదేవి కుమారునుద్దేశించి

వ॥ హా కుమారకా సిరియాళా నేనేమిసేతురా తండ్రీ ( అని మూర్ఛిల్లి కొంతవడికి తెలివొంది) హా కుమారా,

సీ॥ నవమాసములు మోసి నాగర్భముననిన్ను । పెంచి పోషించితి ప్రేమగదుర । అన్నోదకములు నీకనుకూలముగ నిచ్చి । యొత్తిపోషించితి యేసుతండ్రి । వొక్కనాడైన నీచెక్కిలి వేయంగ లేనైతితండ్రి నేమానజాల । నీరూపు నీహాయియల్ నీసుందరము నీదు । మన్ననల్ నేనెట్లు మరతుతండ్రి । యొక్కడీ జంగమునకు నీచక్కనైన । తనువు మాంసంబుపై ప్రేమ దగిలియుండె । నిట్టివింతలు నేనెన్న జరుగనైతి । హా కుమార స్మరాకార యద్రిధీర ॥

వ॥ హాకుమారా సిరియాళా నేడెంతగతి వచ్చెరా తండ్రీ నీ ముఖంబుజూడని దొక్కనిమిషంబైన నిల్వగలనా యేక పుత్రుండవగు నిన్నెట్లు బాయుదును (అనిభర్తతో) నాథా ఇదియొంత విపరీతము,

వాదము - ఆది.

సు॥ నేనేమి సేతునునాథా। యీదింతలెల్లా । నేనెన్న డెరుగాను నాథా ॥నేనే॥ భూనాథ మీరలిట్లు సూనునిపై మోహము మాని యాశైవునకు మరి యభయ మెట్లొసగితిరీ ॥నేనే॥

వ॥ నాథా యెన్నిమోహంబులైన పుత్రమోహంబుతో సమానమౌనా పుత్రులు లేనివాని బ్రతుకు వ్యర్థమేకదా కావున నీవీ పుత్రమోహంబు విడచియున్న పుత్రుని వధించి యమ్మహేశ్వరునకు విందు జేసెదనని యభయంబిచ్చితి వైతే ఇదియెంత నిష్కారుణ్యము.

చి॥ మానినీమణిరో వినవే । శ్రీశంకరుడూ । మన పాలగలడు గనవే ॥మాని॥ పూనినే నభయమిచ్చి యీనాడు బొంక బుధులూ । జ్ఞాన హీనుండని నగరే గానయీమోహమేల ॥మాని॥

వ॥ సుందరీ ముందు ధర్మకంకణ బద్ధుడనై యర్థులేమడిగిన నది యిచ్చెదనని బిరుదు వహించి యిప్పుడీ శైవునకిచ్చి నయభయంబు దప్పిన నన్నెవ్వారెంతమంది యేమని నిందింతురో గదా అదియునుంగాక అసత్యవాదికి యిహపర దూరంబని పెద్దలు జెప్పగా వినమా ఇందులకా శివుడే గలడు భయమేమున్నది.

సు॥ నరమాంసమును యేవిధమూ యిషమాయనో శరణాగ్రణికి యీవిధమూ ॥నర॥ మరినాడు సుతున కైతనకీ ? రువ్యాధి జనియించెనో । భరింప నేనెందు యీతరిగాన నెవరియందు ॥నర॥

వ॥ నాథా మత్కుమారుని కోసరమకో యీజంగమున కీవ్యాధి జన్మించినది కాబోలు లేనిచో యెవ్వరియందు లేని యీనరమాంసంబు నౌషధంబుగా యాభిక్షుడు గోరుటెట్లు ఇదంత మత్పూర్వాకృతమే అయినా మత్కుమారుని బాసి యీశరీరంబున ప్రాణంబులునిలుచునా.

చి॥ తరళాక్షీ విను నేనిపుడూ । ధర్మకంకణమూ । మరిగట్టియును నేనిపుడూ ॥తర॥ యిరవొందగను దబ్బరలేనిపుడాడ హరిశ్చంద్రుడుమున్ । గరితను సుతుడమ్మడువోయీ గనెము క్తి సత్యము నిలిపీ త॥

వ॥ మనోహరీ మున్నా హరిశ్చంద్రుడు తన సతీ సుతులనమ్మి తానునూ చండాలుని కమ్ముడువోయి గాధిపుత్రుని రుణంబు దీర్చి

సత్యంబు నిలిపి తుదకు పరమపదవి బొందెనుగదా అట్టులనే సత్యవా గ్ధురంధరుండనై ధర్మకంకణము గట్టి యబద్ధమాడిన నన్నుంగని సత్య సంధులెంత హాస్యంబు జేసెదరు అదియునుంగాక సత్యహీనుని భరింప జాలనని మున్నా భూదేవి బ్రహ్మదేవునితో విన్నవించలేదా. కావున యెన్నియైన సత్యంబు దప్పను.

సు॥ సుతు నెట్టులను జంపజూతూ ! పుత్రమోహము నే । నతిమైత్రి తో నేల దాతూ ॥సుతు॥ కుతుకంబుతో నేనే కాంగుని గర్భమున గని వృద్ధా । ర్పిత మిపుడు జేసి పిడవా వెతబొందగా నాయనా ॥సుతు॥

వ॥ మనోహరా లేక లేక వొక్క కుమారునిం గని యక్కుమారు నివ్వడీ వృద్ధజంగమయ్యకొసంగి పుత్రిమోహంబు వదలి యిా ధాత్రిపై నాప్రాణంబులెట్లు భరింతును కుమారుని హింసజూచి దుఃఖంబెట్లు నివారింతును హా దైవమా ఇక నేనేమి సేయుదును.

చి॥ క్షితి కూర్ణపురి శ్రీశివునీ । నమ్మియు నేనిపుడీ । వ్రతనేమ మును వీడవూనీ ॥క్షితి॥ అతివ నీవిపుడు నామోహిలతి దుఃఖ మొందు లేల । సంతతమా సర్వేశ్వరుడు నాగతిపయు తానేగలడు ॥క్షి॥

వ॥ తరుణీ యెన్నియైన వ్రతంబు మాత్రింబు విడువను సత్యం బుదప్పను నిజంబుగా నా శైవునకు మక్కుమారు నర్పింతును అటు పిమ్మట శంకరుడే కలడు సందేహమేమి ఇందులకా వృద్ధ మహేశ్వరుం డు నీసూనునిం దరిగి శొంఠి పిప్పలి మోడి మిరియాలు చూర్ణం బుంజేసి గోఘృతంబునుంబోసి పాకంబు జేసి రెండుఝాములలో భోజ నంబిడుమని చెప్పి తాను స్నానమాడుటకై నదికిం బోయెనుగదా కావున శీఘ్రంబున సిద్ధంబు జేయువలయు లేనిచో నాతెండేమనునోకదా.

సుగ్గులాదేవి (తనలో)

వ॥ హా సర్వేశ్వరా జగద్రక్షకా ఆపత్కాలబాంధవా ఆప న్నివారణా మక్కుమారుని రక్షించి మావ్రతంబు నిల్పుము దేవా మహానుభావ (అని యీశ్వర ధ్యానంబు జేయుచున్నంత)

చిఱుతొండరాజు మంత్రితో

వ॥ మంత్రీ మన మిప్పుడా వృద్ధ మహేశ్వరుని యభీమతార్థంబుం

దీర్చవలయును కావున నీవీ తత్క్షణంబున పాఠశాలకుం బోయి మత్కు-
మారుండగు సిరియాలునిం దోడ్కొని రమ్ము ఆలస్యంబు వలదు.

మం-వ॥ చిత్తము రాజా అట్టులనే దోడితెచ్చెదను ( అని సిరియా లుని పద్దికిఁజని ) రాజనందనా సిరియాలా ఇటొకసారి నామాట వినుము.

సిరి-వ॥ మంత్రీ యేమిసమాచారము తొందరగా వచ్చితివేమి.

వాదము - ఆట.

మం॥ వినుమిక నృపనందన వివేకేతు యాస్థితీ అనువుగ మీతండ్రి యునిను దెమ్మన వచ్చితీ ॥విను॥

వ॥ రాజనందనా మీతండ్రియగు చిరుతొండరాజు యేదో యొక వింతయను కార్యంబుం జేయ సమకట్టి నిన్ను దోడ్కొని రమ్మని నన్ను బుత్తెంచిన నీసాన్నిధ్యమునకు వచ్చితిని గదా రమ్ము పోదము.

సిరి॥ జనకుడు యేకార్యము మనమున దలపెట్టియూ । ననురమ్మ నెయా విధమును దెల్పు ఘట్టియూ ॥జన॥

వ॥ మంత్రీ మజ్జనకుండు తలపెట్టిన కార్యమెట్టిదో నన్ను రమ్మని యాజ్ఞాపించిన విధానమెట్టిదో నిస్సందేహముగా వచించుము నేవిని యెదను.

మం॥ విరివిగ నిన్ను నొక వృద్ధజంగమయ్యకూ । దరికి వక్కించి తా తలచె యిచ్చుటకూ ॥విరి॥

వ॥ సిరియాళా నూరు సంవత్సరంబులుగల పెద్దమనిషియగు నొక జంగమయ్య వచ్చి నరమాంసంబు భిక్షగాగోరిన నరనాయకుండు మాసిరి యాళునిం దరిగియిత్తునని యభయ ప్రధానంబిచ్చినడు ఇదెంత నిష్కా- రుణ్యము యెంతవారైన కన్నకొడుకుల యిందిట్లు జేతురా ఇట్టివింత నే నెన్నడు జూడలేదు.

సిరి॥ కరమున మాతండ్రియూ ఖండించినన్నివా । దొరకును మో క్షమును తుదకును మంత్రీధవా ॥కర॥

వ॥ మంత్రీ మాతండ్రి కరంబునం దెగి జంగమ లింగార్పితంబైన నాకు పిమ్మట మోక్షమే కాని నరకములేదు యెన్నియైన వ్రతభంగంబు

గాతుండ నుండవలయును నాశరీక మాపైవున కల్పితమైనా సరే.

మం॥ యెంతటివారయిన్నను గొంతులు జరిగేవ క్రితా । మింతలో బూనుదు రాని తలు రాజపుత్రా ॥యెం॥

వ॥ రాజనందనా యెంత సాహసులైన నిట్టి వ్రతంబు బూని కొడుకుల గొంతులుగోసి పెట్టెవారున్నారా ఇదియంత వెనుకముందు విచారము లేని శాస్త్రమే కాని వేరొండు గాదు,

సీ॥ చింతిలనేల శ్రీమంతులకైననూ । అంతము దప్ప బోదెంత కాలమున్ననూ ॥చింతి॥

వ॥ మంత్రీ యెంత శ్రీమంతులకైన మృత్యువు దప్పదుగదా ఇందులకై చింతించిన నేమిలాభము యుత్తమ గర్భంబునంబడి ముక్తి బొందుటే మేలుగదా.

మం॥ కడప్రేమ నీపయి గలిగియు నీ సంగతీ । నుడివితిగాని నృపు నడుగుము యీ వర్తనీతి ॥కడ॥

వ॥ రాజపుత్రా నీపై ప్రేమాతిశయముండుటచే నేనీసంగతి నీతో శృతపరచితిని కాని యీవార్త మరుగున బెట్టి నీతండ్రిచే యావద్వృత్తాంతంబుం దెలిసికొమ్మా. రమ్ము పోదము మీతండ్రికడకు.

సీ॥ వుడమిలో కూర్ణపురియుడు రాడ్శేఖరునీ। యడుగులు నమ్మి మన మరుగడ మచటికినీ ॥వుడ॥

వ॥ మంత్రీ ఆలస్యంబెందుకు పమ్ము మాతండ్రిపజ్జ కరుగుదము.

మంత్రి—వ॥ రారమ్ము పోదము (అని చిరుతొండరాజును సమీపించి యున్నంత)

సిరియాళుడు తండ్రితో

వ॥ నాయనా తొందరగా నన్ను రావించు కారణంబేమో శృతపరచుడు.

చిరు-వ॥ కుమారా సిరియాళా నేనావార్త జెప్పుటకు నామది ధైర్యంబు చాలకున్నది నీతల్లి నడిగి తెలిసికొమ్ము నాయనా.

సిరియాళుడు తల్లితో

వ॥ తల్లీ నేడేమో మానాయన్నగారు చింతాక్రాంతుండై చిన్నంబోయి యున్నాడు కారణమేమి నీవైన చెప్పరాదా,

సుగ్గు-వ॥ కుమారా నేనేమని చెప్పుదు యీవార్త విన్నతోడనే నామనంబు ఝల్లు జెందుచుండెనుగదా.

సిరి-వ॥ తల్లీ ఇంత చెప్పరానిదా యొకటేపరి చెప్పుము.

వాదము – ఆది,

సు॥ తనయా వినుమిక నేడు విన జేతు యీస్థితియూ । వినవింత యగుచుండురా । తనయా । తనయా । తనయా ॥తన॥

వ॥ నాయనా యెక్కడలేని యిక్కట్టు మనకు సంభవించి వచ్చెను గదా ఇక మనమేమి సేయుదము,

సిరి॥ అనుమానమునుయేల జనని యీనిజవార్త । వినిపింపుమిక విందునూ । జననీ । జననీ । జననీ ॥అను॥

వ॥ తల్లీ అనుమానించెద వెందుకు నిజంబుగ యీవార్త యేదో వినిపించుము,

సు॥ బాల విను మొకవృద్ధ శీలశైవుడు వచ్చి । యిరాత్రినరమాంస మడిగే । తనయా । తనయా । తనయా ॥బాల॥

వ॥ కుమారా వొక శతమానాబ్ద వృద్ధ మహేశ్వరుండు వచ్చి నర భోజనం బడిగిన నందులకు మీతండ్రి యొప్పుకొనియభయంబిచ్చి తత్కార్యారంభమునకై విచారించుచు చింతిల్లుచున్నవాడు గదా.

సి॥ యేలీల నభయంబు యిచ్చె జనకుడు నతని । ఆలీల వివరించవే । తల్లీ । తల్లీ । తల్లీ ॥యే॥

వ॥ తల్లీ మజ్జనకుండా శరణాగ్రణి కొసంగిన యభయ ప్రదానం బెట్టిదో వివరించుము.

సు॥ మాదేహములు నివ్వ మరియొల్లనన తండ్రి । నీదేహమర్పించెరా । తనయా । తనయా । తనయా ॥మా॥

వ॥ కుమారా అతండా నరమాంసంబు గోరిన మాయిద్దరి శరీరంబులు జరిగి యిత్తుమన్నను నాతండొల్లనందున నీశరీరంబు దరిగి పక్వించి పెట్టెదనని మీతండ్రి యొప్పుకొన్నంత నాతండందులకై సమ్మతించెను గదా,

సిరి॥ భూదైతు డీరీతి బూన మంచిదేయౌను । నాదేహ సఫలంబిదీ । జననీ । జననీ । జననీ ॥భూ॥

వ॥ తల్లీ మాతండ్రిగారు చేసిన యుపాయము మంచిది అదెట్టులన వేయి జన్మంబులం జేసిన పాప పుంజంబులనైన దొలగించి నిత్య ముక్తిని సంపాదింప వచ్చును ఇందులకా శైవునకు నా దేహ మర్పించుటమే మంచిది ఇప్పుగదా నాజన్మ సఫలమైనది.

సు॥ వ్రతమీవిధముబూని క్షితినాథుడను నీకై। గతియేమున్నది మాకికా। తనయా। తనయా। తనయా ॥వ్ర॥

వ॥ కుమారా మీతండ్రిగారి వ్రతంబు బూనుట నీ ప్రాణంబుల కత్యే కాబోలు అయినా నిన్నుబాసిన మాకేమిగతి యా బ్రహ్మదేవుండింత కఠినుండై నీకిట్లు వ్రాసియున్నడు కాబోలు.

సిరి॥ క్షితిపూర్ణపురి గౌరీపతి గలడు నీవిట్లు। అతిఖేద పడుటేలనే। తల్లీ। తల్లీ। తల్లీ ॥ క్షి॥

వ॥ తల్లీ నీవిట్లు దుఃఖింప నవసరములేదు నన్నా శైవున కర్పించి వ్రతంబు నిల్పుడు ముందు కైవల్యంబు దొరుకగలదు.

సు-వ॥ కుమారా నీవెంత జెప్పిన నామనంబు స్థిరంబు గాకున్నది నేనేమి సేయుదు.

సిరి-వ॥ తల్లీ ఇట్టి యజ్ఞానంబున కా శివుడు మెచ్చడు యూరొకనుము (అని తండ్రితో) నాయనా ధర్మకంకణ బద్ధుండవై యర్థులుంగోరు కోర్కులు సమకూర్తునని బిరుదు వహించి ఇప్పుడీ లో భరతుండవైయుండ ఫలంబులేదు నన్నా శైవున కర్పించి వ్రతంబు నిల్పుము.

చిరు-వ॥ అయ్యోకుమారా నేనేమి సేయుదు.

వాదము - ఆట.

చి॥ నిన్నెడబాసి నిలువదు ప్రాణమూ। నన్నెడబాయ నీకగునే న్యాయమూ ॥ని॥

వ॥ కుమారా మన్మథాకారుండవగు నిన్నుబాసిన నా ప్రాణంబులీ భూమియందు నిలుచునా నాకు నీకెడబాటు సంధిల్లు కాలమువచ్చె నాతండ్రీ.

సిరి॥ నన్నుగ నీవీ పగిదిని చింతిలా। నెన్నగ న్యాయమే నన్నుగా నీవిలా ॥నన్ను॥

వ॥ తండ్రీ ధర్మప్రభువని యెల్లలోకంబులయందు వన్నెకెక్కిన మహానుభావుండవై ఇట్లు దుఃఖించిన నేమి లాభము నీవ్రతంబేదో నిల్పుకొనుము.

చి॥ వృద్ధమహేశుడు వేడగ నిన్నికా। శ్రద్ధతో నిచ్చితీ సంశయ మెన్నకా ॥వృ॥

వ॥ నాయనా పెద్దమనిషియగు జంగమయ్య నిన్నడిగిన దున మాట దోసియలేక నన్నొసంగి నేడీపాటు జెందవలసి వచ్చెను గదరా తండ్రీ.

సిరి॥ బద్ధమతని కర్పణమైన సరేకనీ। శ్రద్ధతో విడకీ వ్రత పద్ధతి పూనీ ॥బ॥

వ॥ నాయనా ..శరీర మాశైవున కర్పితమైనా సరేకాని నీవ్రతం బుమాత్రము మానకుము.

చి॥ యేటీరందువో నాతగు వాక్కు కూ। ప్రీతితో దెల్పగా యీ వేళకూ ॥యే॥

వ॥ కుమారా నేనన్నమాట మీరక నీవేమందువో చెప్పుము నేవిని యెదను.

సిరి॥ ప్రీతితో శైవునకీతరి తృప్తిగా। నాతనుగిచ్చియూ నడుపుడి బాగుగా ॥ప్రీ॥

వ॥ నాయనా సంశయించెడ వెందుకు ఇదే నాశరీర మాశైవునకు శివార్పణంబుగా నొసంగి యాతని మనోతృప్తింజేసి పంపుడు ఇదిగో నా ముఖ్యోద్దేశము.

చి॥ అతిమోహంబున సుతనితి బెంచియూ। హతమును జేగ నానెటు పొంచియూ ॥అతి॥

వ॥ కుమారా నిన్నతి గారవంబున బెంచి పోషించి యింతవానిగా జేసి యిప్పుడీ పాపపు చేతులతో నిన్నుద్రుంచి నీశ్రమజూచి నెట్లు భరింతురా తండ్రీ.

సిరి॥ పతియగు కూర్ణపల్లి మహేశుడే। సతతము బ్రోచును గతి మన కాతడే ॥పతి॥

వ॥ తండ్రి సర్వ భారకర్తయగు శంకరుడే కలడు ముందే తమరీ యాషణత్రయంబులంజయించి వ్రత నేమంబు బూనిన నీకీ భీతియేం

దుకు యెన్నాళ్ళు బ్రతికిన యీ శరీర మస్థిరమని మీకుం దెలియదా తెలిసి తెలియని వానివలె వాకొంచ ధర్మంబుగాదు నన్నా శైవున కర్పించుటయే మంచిది.

చిరు-వ॥ హా కుమారా నీవెన్ని జెప్పిన పుత్రమోహంబు విడజాలకున్నది నేనేమి సేయుదు. (అని ఖిన్నుండై యున్నంత)

సంగలాదేవి భర్తను సమీపించి

వ॥ నాథా కడుపారగని చేతులార బెంచిన యీ చిన్నకుమారుని ఖండింప నీచేతులెట్లువచ్చు నెంతపని జేసితివి యీపిచ్చి జంగమున కొప్పితివి.

వాదము - యేక.

స॥ ధారుణీశ్వర విచారము జేయక యేరీతిభయము నిచ్చితివిక హా। భూరిగ మన కాధారంబగు సుకుమారు నివ్వ నెటు మనసొప్పెను హా ॥ధారు॥

వ॥ నాథా దూరభారము విచారించక మనగతి మోక్షంబుల కాధారంబగు యీకుమారుని నీవెట్లు హింసింతునని యీశైవున కొప్పుకుంటివి యెంతయైన విచార ముండగూడదా.

చి॥ సారసాక్షి యీశైవు డడుగగను కోరియిస్తి మనకొమరుని వుడు హా। ఆరూఢిగ నిటులైతేమిక యీమార హరుడు గలడో రమణిరో హా ॥సార॥

వ॥ సుందరీ యీవృద్ధ మహేశ్వరుండడిగినందున నేనభయ మిచ్చితిని ఇందుకు తొందరేమి మాటిచ్చి తప్పుట మర్యాద గాదుగదా ఆపైన శంకరుడే కలడు చింతించకుము.

సిరియాళునితో

స॥ తనయా నీవు యీదినమునందు మమ్ములను బాసియు నెటజనుదెంతువో హా। మనసిజు బోలిన ఘనసుందరతను గనకుండిన యీరాజ్యమేల హా ॥తన॥

వ॥ కుమారా మరుసమాన సుందరుండ వగు నీవీదినంబున మమ్మెడబాసి యెచ్చటికి బోయెదవురా తండ్రీ నిన్నుజూడని దొక్క దినంబు యుగంబుగా నగును నీవే మాగతి యని నమ్మియుంటిమి గదా.

సిరి॥ జనని వినవె నీమనసున చింతిల పనియేమిక నే వినిపింతును హా । అనఘుడైన యాహరుని జేరగను జనుచుంటిని యీ దినమందున హా ॥జన॥

వ॥ తల్లీ నావిషయమై నీ వేమి చింతించ వలదు నేనా సర్వేశ్వరుం డగు శివునిం జేరబోవు చున్నాను యీ మాత్రమున కన్నీరు దీయవలదు.

చిరుతొండరాజులో

సు॥ తరువునెక్కియును కరములు విడచిన కరణియాయె సుతుడ రుగ నెంచ హా । విరివిగ మది నెత్తురిదోచదు భూవరవరేణ్య నాదరి యేదిక హా ॥తరు॥

వ॥ నాధా చెట్టెక్కి చేతులు విడచినట్లు మనకాధార భూతుండగు కుమారుని ఖండింప నాయనుగదా యెంత మోస మెంత మోసము.

చి॥ తరుణి వినవె యాశరణుని కోరిక లిరవొందగ దీర్తురయంబని హా । మరి వొట్టును నే నరయబెట్టి యది మరచిన నగరే ధరపతులిల హా ॥తరు॥

వ॥ తరుణీ నేనాశరణుని కోర్కెదీర్తునని వొట్టుబెట్టుకొని నేనిప్పు డట్టిమాట కాదనినచో నాబోటి ధరాధిపతులేనుని నిందింతురు అదినీకుం దెలియదా.

సిరియాళునితో

సం॥ కొడుక నిన్ను నేదుడుకు తనంబున విడిబడి చెక్కిలి వేయనైతి హా । కడు ప్రేమతోనిను కడుపారంగని మిడుకనాయె నిప్పుడు తుదకును హా ॥కొడు॥

వ॥ కుమారా ముద్దుల పట్టివగు నినొక్కసారైన చెక్కిలి వేయనైతిని ఇట్టి మోహాంపు పుత్రుండవగు నిన్నెడబాయుట కీనాడు సంభవించెనా యేమి నాయనా వొకసారి నీముఖంబు జూపుము.

సిరి॥ కడునే నెక్కడి కొడుకును మీరెక్కడి తలిదండ్రులు గణుతింపగ హా । పుడమి కూర్ణపురి యుడురాడ్ధరుడాడయాడి మాయయిదంతని యెరుగుము హా ॥కడు॥

వ॥ తల్లీ నేనెక్కడి కొడుకును మీరెక్కడి తలిదండ్రులు ఇదంతె దైవమాయా కల్పితంబని యెరుంగుము యెరింగి నీవీ యజ్ఞానాంధ కా

రంబగు శోకంబుమాని సంతోషంబున నందుము నేనా హారునిం జేరజో మొదను,

సు-వ॥ అయ్యో కుమారా నీమృదు మధురంబగు పలుకులు విన్న నాహృదయ మెంతో బెదరు చున్నది ఓ కుమారా నీవన్నె చిన్నెము ద్దులు గులుకు నీముఖార విందం బొకసారి నాకుం జూపుము నీముద్దులు నీసుద్దులు నేనెట్లు మరతురా తండ్రీ. (అని అనుచున్నంతలో)

పరమేశ్వరుండు వచ్చి కోపములో

వ॥ ఒరెఒరే నరాధమా యెంతమోస గాడవురా రెండుఝాము లలో పుత్రుని ఖండించి వండి పెట్టెదనని వాగ్దాన మొసంగి వేళనతి క్రమింపజేసితివి యేదిరా నీసత్యము ఇసంత డాంబిక వేషమే కాని యేమి యుండగాదు.

చిరు-వ॥ అయ్యా నేనబద్ధమాడలేదు వొక్క యరక్షణంబు తాళుడు మీమనోతృప్తి జేసెదను,

వాదము - యేక.

వ॥ నరవరాధమా నీతెరంగు దెలిసెను మోసంగకుర చాలు చాలు ॥నర॥ విరసములాడ । సరసములౌనేడా । త్వరగా మరువు ॥ నర ॥ వరగ నప్పుడంటివి నీవర కుమారుద్వంచి పక్వమిరవు గ నుజేసి పెడుదు నిక రెండు । వరఝాములా యంచుబలికి మరచియు నెటులుంటివోర । గురుతెరిగితి ॥నర॥

వ॥ ఒరే రాజాధమా యెంతబద్ధికుడారా రెండు ఝాములలో కొడుకును ఖండించి వండి పెట్టెదనని యభయంబిచ్చి యిప్పుడు దప్పితివి యదోచూడుము రెండోయామము మించినది,

చి॥ శరణాగ్రణీ నీవిటులా । కోపించకూ ॥శర॥ అరక్షణము తాళు డిందు మరినాదు సుతుని దృంచీ । పరిపక్వమును జేసి నేనరలేక నొసగు వాడా ॥శర॥

వ॥ స్వామీ నిరపరాధినగు నాయందిట్లు కోపించదగదు యొక్క యరక్షణంబు తాళిన నాపుత్రునిం దరిగి మీకర్పించెదను తొందరెందుకు.

పర॥ ఇపుడ పారవారంబగు క్షుధచే పరితపించు చుంటిని చాల ॥ ఇపు॥ శపథము దప్పి । చెరించితివి యొప్పి । నృపాధమ ॥ఇపు॥ కృపణ నిన్నుజూడ మదికి నిపుడు క్రోధవుధి రించె చపలచిత్త నిన్ను గాచక్షణ మైన । అపరిమితంబగను వేడదువ మేమో తెలదు నిన్ను । శపియింతు ను ॥ఇపు॥

వ॥ ఓరీ కపటమానసీ నీవేమో నన్నతి ప్రియంబుగా ప్రార్థించు చున్నవైతే నీయుపాయ మేమో నాకుం దెలియదు అసత్యవాదవగు నిన్నిపుడే శపింపక మానను చూడుచూడుము నాక్రోధాయ మానసంబు నీవెరుంగవు.

ఉ॥ కృపజూడుమిక నావయినా । శరణాగ్రణీ ॥కృప॥ శపథంబు దప్పలేదు సఫలంబు జేతునీదూ । విపులమా కోర్కెలెల్లా శపియింప నెందుకయ్యా ॥కృప॥

వ॥ అయ్యా నాయందింత కోపము లంబు జేయతగదు నేనన్నమాట దప్పను శరణాగ్రణి నన్ను క్షమించి శపింపక కృపజూడుము నీమనోతృప్తి జేసెదను.

పర॥ హాటమిశేల నామోహిలిటుల్ పెక్కువాక్ఛటల్ బల్కబోకు మురా ॥అట॥ దిటముగ నేనీ । పటువ్యాఘ్రరి సరణీ । ఇటుంగంటి ॥అట॥ యెటులనైన నీదుచిత్త మిటులదెలిసె చాల కుచేష్ట కటికి మా సుండవంచు నే దెలియా । కటకట నే నెంత మోస కలితుడనై యిటకొచ్చితి । యెటు దోచక ॥అట॥

వ॥ ఓరీ కపటశీలా నీకుచేష్టలెల్ల నాకుం దెలిసినవి నీవిట్టి ధర్మకం కణబద్ధుండవై నావంటి బీదజనుల నెందరినో యిట్లే మోసపుచ్చి పంపి యుండవచ్చును దుర్మదుండవగు నిన్ను నమ్మరాదు నీమాట సత్యములేవు కాదనుము యెచ్చటికైన బోయెదను.

చి॥ పటుకార్ణపురి శ్రీశివునీ । నెరనమ్మియయా ॥పటు॥ యిటదీర్తు నీదుకోర్కె యెటులైన బొంకజాలా । మటుమాటుగాదు భవసంకట దూర నిశ్చయముగ శ్రీ ॥పటు॥

వ॥ మహేశ్వరా అబద్ధంబుగాదు యొకక్షణంబు తాళిన నీజిహ్వా రుచిబుట్టింప జేసెదను ఇది కుచేష్టగాదు నిజంబని నమ్ముము.

పర వ॥ యేమి నిజంబుగ నీపుత్రుని మాంసంబు నాకర్పించెదవా నీవ్రతపద్ధతి నిల్పెదవా యేది దృఢంబుగ జెప్పుము అట్లుకాదేని పోయెదను.

చిరు-వ॥ అయ్యా నిజంబుగనే నాపుత్రుని దరిగి నీకర్పించెదను ఇది ముమ్మాటికి సత్యమని నమ్ముము నేబొంక జాలను.

పర వ॥ మంచిది అట్లులనే కానిమ్ము రాజా నేనీమధ్య కథాటి కోపకున్నవాడ నేనా దేవాలయంబులోకి పోయి యుండెదను నీవతిశీఘ్రంబున నీసూనుని వధించి పక్వించి నాజాడనే తెమ్ము నేవచ్చి మనోతృప్తిగ భక్షించెదను.

చిరు-వ॥ చిత్తము దేవా అలాగే దేవాలయంబునకుం జనుండు నేనీ నరభోజనంబు సిద్ధంబు జేసి మీవద్దికి వచ్చెదను వచ్చిన మీరు రావలయును.

పర-వ॥ మంచిది ఇదే నేబోయెదను (అనినిష్క్రమించి)

పరమేశ్వరుడు పార్వతితో

వ॥ పార్వతీ నేనొక చమత్కృతి జేసి వచ్చినాడను విన్నావా.

పార్వతి-వ॥ పరమేశ్వరా యేమి చమత్కృతి.

వాదము - యేక.

పర॥ వనజముఖిరో వినవె నేనా మనుజనాథుని జేరియూ , ఘన మునిస్వరూపంబులాడితి కపటముగ మది బూనియూ ।వన॥

వ॥ గిరిజా నేనా చిరుతొండనిజేరి యెన్నో నిష్ఠూర వాక్యంబులాడి వచ్చితినిగదా ఆవిపలుంచిన నామదికే చిత్రంబగుచున్నది.

పా॥ మనసిజ మదాంతక యదేదో వినగజేయుమి వినియెదా । అనఘుడా యా భక్తునితో యేమంటివో మది కనియెదా ॥మన॥

వ॥ మనోహరా నీవా పరమ భక్తుండగు చిరుతొండని యేమని నిందించితివో చెప్పుము వాడు మహా సత్యసంఘుండుగదా.

పర॥ రెండుగ్రామములు మించెనేమిదిర తిండిబోతుని దూషించితి! నే.. డివాడవు నిజ.. మొదలెయని నిందించితి ।రెం॥

వ॥ ఒరే నరాధమా రెండుగ్రామములు మించిపోయెను నాకనే

కముగా క్షుధ యగుచున్నది. నీవు పెడుతనన్న నరభోజనం బేదిరాయని ధిఃకరించి నేననేకముగా దుర్భాషలాడితిని.

పా॥ దండిగను నీమాటవిని చిరుతొండడేమని యన్నడూ। నెంతు మతితో దెల్పుమిక నాలించెదను నేమన్నడూ ॥దం॥

వ॥ నాథా నీదూషణాలాపంబులు విని యా చిరుతొండడు మరల నేమన్నాడు యవ్విధంబంత విన్నవించుము నేవినియెదను.

పర॥ వొక్క క్షణమాగుడి కుమారుని నిక్కముగ ఖండించియూ। మిక్కిలిగ నే నొసగుదుననే మేలిమిగ వండించియూ ॥వొ॥

వ॥ పార్వతీ యీ నావాక్యంబులు విన్నతోడనే గడగడ వడం కుచు భయంపడి నన్ననేక విధంబుల ప్రార్థించి యొక తృణంబు తాళిన మత్కుమారుని వధించి వక్వంబు జేయించి నీమనోతృప్తిం జేసెదనని యా చిరుతొండండాడినాడుగదా.

పా॥ మక్కువతో నేడక్కజము మీరెక్కడను వసియించగా చొక్కముగ యోచించితిరో యది నిక్కముగ దెల్పుడియిగా ॥మ॥

వ॥ మనోహరా మంచిదేశాని మీరిప్పుడెక్కడ నుండెదనని యోచించినారో నిజంబుగ వచించుడు మత్కర్ణానందంబుగా విని యెదను.

పర॥ ఇట్టి దేవాలయము విడిచి పెనుచెట్టులుంగలయడవిలో। గుట్టు గను యొక జమ్మినీడను కోరియుందము నందుకో ॥ఇ॥

వ॥ పార్వతీ మనమిప్పుడుండు యీదేవాలయంబువిడిచి యెవ్వరి కగుపడకుండ పెద్ద యడవిలో యొక జమ్మిచెట్టుక్రింద వసింతము అట్టి మన జాడ చిరుతొండండెరుంగునో లేదో చూతము.

పా॥ గట్టిగను శ్రీకూర్ణవల్లిని పట్టభద్రుడ వైతిగా। ఇట్టిభక్తుని శ్రీయుల బెట్టగ నేల తమరికి తగదుగా ॥గ॥

వ॥ నాథా యింక నీభక్తుని యెంత కష్టపెట్టెదరు యెంతకష్టపెట్టిన వాడింతయైన జనికేవాడు గానట్టులున్నది వాడబద్ధమాడుమాట కల్ల.

పర-వ॥ మంచిది మనోహారీ యింకా ప్రయత్నించి చూతము గాని మనమిప్పుడైతే యీ గ్రామ దిగ్భాగంబున నొక జమ్మివృక్షంబు గలదు దానిక్రింద నుందము పద్మ.

పార్వ-వ॥ మనోహరా అట్టులనే యాశమీవృక్షంబు క్రింద నుండ ముదమ్మా (అని నిష్క్రమింతురు)

చిరుతొండరాజు భార్యతో

వ॥ సతీ సుగ్గులాదేవి వింటివా యమ్మహేశ్వరుండువచ్చి యాకటి చెప్పుకోపలేక యెంత నిష్ఠూరమాడి పోయెనుగదా యిగ నాలసింప వలదు మన కుమారుని జలకమాడించుము వేళ నతిక్రమించగలదు.

సుగ్గు-వ॥ నాథా నాకేటు దోచుటలేదు వేళమించిన నతడేమ నునో కుమారుని ద్రుంచిన మనకేమిగతి.

చిరుతొండరాజు సిరియాళునితో

వ॥ కుమారా ఇటురమ్మా.

సిరి-వ॥ తండ్రీ యేమి.

వాదము - రేక.

చి॥ సుత నిన్నిపుడుక్ హతముంజేయా మతినూహించగా మను సొప్పదురా । హింసమెంచకనిక్ హింసించిన మాగతియేమున్నది క్షితి లోపలరా ॥సుత॥

వ॥ హా కుమారా నిన్నుబాసిన మాకేదిదిక్కు.

సిరి॥ క్షితిపతినాదుతండ్రి నీవిట్లూ మతిచింతిల్లుచుండగనురొట్లూ॥

క్షితి॥ వ్రతము నిలచునదెట్టులా వలదు నీమది కెట్టులా సతతమును ధైర్యం బునను సాధ్యతత నొందును కార్యములు ॥క్షితి॥

వ॥ తండ్రీ నీవిట్లు చింతించుచు అధైర్యంబుననుండ కార్యంబులు కానే రవు ధైర్యంబుం దెచ్చుకొని నీవ్రతంబేదో నిల్పుకొనుము ఇట్లు చింతిలు చుండిన నేమిలాభము.

చి॥ నాకరములనిక్ నేకరణియు నేప్రకటముగనిక్ వధియింతు నురా । లోకులు యిదివిని లోలోపలినక్ నేకరణియు నిందింతురో గదరా ॥నాక॥

వ॥ కుమారా అతిసుకుమార శరీరంబుగల నిన్ను యీనా కఠిన హస్తంబులందునిమి నీఘోషజూచి నేనెట్లు భరింతురా తండ్రీ అదియు నుంగాక యీవార్తవిన్న లోకులు నన్నెంత పాపాత్ముండని దూరుదురో కదా.

సిరి॥ చేకొని నీవు యీవిరము జల్కా జెల్లునె యెంచిచూడమది గుల్కా ॥చేకో॥ లోకనింద నతుల్ తగా । యీకళేబరమున కేగా । నీక నాత్మకులేకనియదు మనువినవె పెద్దల వాక్యములు ॥చేకో॥

వ॥ నాథా ఇదియేమి యజ్ఞానము యీ కార్యంబుంజేయ లోకులు నన్నెంత నిందింతురోయని వాకొనుచుంటివైతే నిందా స్తోత్రంబులు యీదే ...బునకేగాని యాత్మకులేవని పండితులు జెప్పగవినవా వినియు నీవే యజ్ఞాన కూపంబునంబడ పోడిగాదు యెట్లో యాత్మోద్ధారకము జేయుటమే కర్తవ్యము.

చి॥ చిన్నితనయ నీవన్న సువాక్కులు యెన్నగ నిజమై యున్నవి గదరా । కన్నకడుపునకీ మన్నన బెంగయు యిన్నదు నిన్నెటు హింసింతునురా ॥చి॥

వ॥ కుమారా నీవన్నమాట నిజమేకాని కన్నకడుపుగదా నిన్ను వధించిన నా మనంబెట్లు నిల్చును.

సిరి॥ కన్నయ్య నీవిన్ని యనుటేలనూ । తిన్నగ లోకభ్రాంతులు మానూ ॥క॥ అన్నరీతి నొనర్పుమా అదియు దప్పగ బోకుమా । వన్నగను శ్రీకూర్ణపురిభవు సన్నిధికి నేబోయెదను ॥కన్న॥

వ॥ తండ్రీ నీవిట్లారాట మొందక నిరాటంకముగ నన్నా శరణాగణికోసంగి నీవ్రత పద్ధతి నిల్పుకొమ్ము సుకీర్తివంతుడవు గమ్మి నాకోసర మెంతమాత్ర... ...లంబు నొందవలదు నేనా హరునిం జేరబోయెదను ఇందుకేమి సందేహము లేదు.

చిరు-వ॥ సరి మంచి (తనలో) అవును నేనిట్లు అధైర్యంబున చింతించుచు కాలంబు గడుపుచున్న వ్రతభంగంబు కాగలదు ఇందుకా శైవుండు వచ్చి కాలాతిక్రమంబున కోపక నన్నేమని శపించునోకదా ధైర్యంబు దెచ్చుకొని తత్కార్యంబు నెర వేర్చెదగాక (అనిప్రకాశముగా సుగులా దేవితో) సతీ సుగ్గులాదేవి యెంతవిలపించిన నేమిలాభమున్నది. వేళమించ్గె శైవుండు కోపించగలడు కావున ఇదే మనకుమారుని స్నానమాడించి సిద్ధపరచుము ఖడ్గంబు బూనివాడ.

వ॥ నాథా గడచినదానికి మిడికిన నేమి లాభము రోటిలో తల బెటి రోకండ్లకు వెరవనేల కాగల కార్యంబు కాకతీరదు ఇదే కుమారుని

జలక మాడించి సిద్ధపరచి యున్నదాన ఖండింపుడు యాపైన శంకరుడే కలడు.

చిరు-వ॥ సరి మంచిది. (అని సిరియాళునితో) కుమారా ఇచ్చట పవళించుము ఆలస్యంబు వలదు.

సిరి వ॥ తండ్రీ సిద్ధముగానే యున్నాను ఇదో శయనించెదను(అని పడుకుండును)

చిరు-వ॥ మనోహరీ ఇంక తడయనేల ఇటువినుము.

సుగ్గు-వ॥ నాథా యేమి సెలవు.

వాదము - సీసమాలిక.

చి॥ కలికి యీకొమరుని కరవాలమున ద్రుంచి పక్వంబు జేతమా పడతి నేడు॥

సు॥ అనుమానమును యేల మనుజేశ సుతుకళేబరమును రయంబున దెమ్ము మదమెలర్ప॥

చి॥ మదవతి మనపుత్రుపదములు గట్టిగా బట్టుము శివునిపై భక్తినుంచి॥

సు॥ అదిమి పట్టితి నెటుకదల నివ్వక సుతుని వధియింపు నీమది చెదరనీక ॥

చి॥ కత్తిచే మాంసంబు కడువేగమున గోసి భాండనింపితి తెప్ప నిండుమతిని ॥

సు॥ తత్తర పడనేల మొత్తని మాంసంబు వండుదు సంశయ మొందు లేక ॥

చి॥ తీరుతీరైన యాయాలు దివ్యముగను । గోసి వేర్వేరు పాకమింకొనర జేయు ॥

సు॥ నాథ నీవన్నరీతినే నాచరింతు । శంకరుని డెందమున నమ్మి సకల విధము ॥

చిరు-వ॥ మంచిది మనోహరీ ఇంకొక విచారము.

సుగ్గు-వ॥ యేమి విచారము.

చిరు-వ॥ చెప్పెద నిటువినుము.

చ॥ శిరమొకచోట నుంచియును ♦ చిన్నకుమారుని మాంసమంతయున్
మరియు మసాల చూర్ణము సమన్విత ♦ పక్వము జేసి యుంచుమా
సరగున వీధికిం జలియు శైవుని ♦ గాంచి నమస్కరించి నే
నిరవుగ దోడితెచ్చెదను యింతిరో ♦ గేహ మలంక రించుమా ॥

వ॥ మనోహారీ యీశిరస్సు నొకచోటదాచిపెట్టి కుమారుని మాంసమంత తఱిగి సమస్త మసాలలుం గలిపి గోధుమ్రంబు బోసి వేరువేరుగా పక్వంబు జేసి సిద్ధముగా నుంచి గృహ మలంకరించుము నేనిదే శైవుని కడకరిగి నమస్కరించి తోడ్కొని వచ్చెదను.

సుగ్గ-వ॥ నాధా మీరను విధంబుననే వేరువేరుగా శాకపాకంబులుం జేసి యనేక రుచులుండు నట్లుగా సిద్ధంబుజేసి యుంచెదను గాని నీవతీ వేగంబునం బోయి యా శైవుని దోడ్కొని రమ్ము వేళ నతిక్రమించిన కోపగించ గలడు మునలియైన ముక్కోపిగదా.

చిరు-వ॥ మంచిది నేనిదే పోయివచ్చెదను (అని వెళ్ళి దేవాలయంబులో జూచి శైవునిం గానక) అహా ఇదియేమి యాశ్చర్యముయీ దేవాలయంబులో యమ్మహేశ్వరుండు లేడుగదా యెచ్చటికేగెనో తెలియదు యీవాడయుల స్థలంబు లెల్లవెదకి చూచెదను (అని అట్లు జూచి) అయ్యో యీవాడయుల యిండ్లలో కూడా లేడుగదా ఇక నేనే మి సేయుదు.

దర్వు - జుల్వ.

యెందుబోయెనో శైవుడు నేడెందుజూడ దొరుక డాయె । నంద నుపక్వించు దేవమందిరమున నుండుననియె ॥ యెందు ॥ దిటముగ వేవేల దివ్య మఠముల మింత ధర్మశాల । లెటుజూచిన దొరుకడెంత కుటిలమొ కని తెలియజాల ॥యెందు॥ వివిధమైన వాడవాడ విఫణి మార్గములును జూడ । సవినయముగ నించుకైన జాడలేదు దొరుకడేడ ॥యెందు॥ ధరణి కూర్ణపల్లి శివుడె తరచియు నాభక్తి జూడ । తరుణితో నేతెంచె నేమొ మరుగు వేషమునను వేడ ॥యెందు॥

వ॥ అయ్యో నేనీ పురంబంత వెదకి చూచిన యచ్చరణాగ్రణి దొరుకకున్నడు గదా యిక నేనేమి సేయుదు.

దర్వు - రూపకము

యేమిసేతు యెందుబోదు । ఆమహేశు జాడ లేదు । నేమమివుడు విడువరాదు । యేమొ కాని యెటనరాదు ॥యేమి॥ లేనిపోనిది యీగొప్పవ్రతము బూని దానకంకణము నేనేల గడితీ । యైనయెక్కడి దంపతులొచ్చి యీమనుజ మాంసంబు గోర నేనెందు జూడనైతీ । యీలోన వారడుగ నాసుతుని గోసిచ్చుత్తు నని వారితో నేనేల వాగ్దాన మొసంగితీ । ఐన చింతలేదు కాని । అతడు జాడ లేదు పూని । యీనిధాన మాంసమేవని । కై సిపుడప్పణ మేమజేతు హా ॥యేమి॥ అతని ధానము భక్తితో నేజేయు వ్రతనేమ మేమైన దప్పియుండె నేమో । సతతమే యర్థులేమడిగిన లోభ రతుండనై యప్పదార్థముల నెల్ల నొసంగక యుంటి నేమో । యీగతి లభించుట కేమి కారణమో కాని తెలియరాదతడు దొరుక జాలని విధానమేమో । శ్రీతిని కూర్ణపల్లి వాస । గతి విసీవే కృత్తి వాస । వ్రతమునిల్పి యామహేశ । సతిపతులను రాసల్పు మిటకు హా ॥యేమి॥ (అని ధైర్యంబున )

వ॥ ఛీ యెంత మోస మెంత మోసము నేసిప్పుడా శైవపుంగవునింగానక రిత్తచేతులతో నాయింటికిం బోయి నాభార్యతో నేమని చెప్పుదు నావ్రత భంగంబున కెట్లోపుదు అట్లుగాదు యాశైవుని విషయమై నా ప్రాణత్యాగంబు జేసికొనుటమే మంచిది ఇందులకీ గండకత్తెరం దాల్చెదగాక ( అని గండకత్తెరం దాల్చి తనలో ) హే శంకరా పాపభయంకరా సర్వలోక శరణ్యా సాక్షాత్పరమపద వరేణ్యా ఇదో నాప్రాణంబులు నీకర్పించు చున్నవాడ గైకొనుము ( అని గండకత్తెరం దాల్చి యున్నంత)

ఆకాశవాణి వాక్యము

వ॥ ఒరే చిరుతొండా ఇటొక సారి నామాట వినుము నేనాకాశవాణిని,

చిరు-వ॥ తల్లీ యేమియాలోచన,

ఆకా వ॥ నీవా శైవునకై ప్రాణత్యాగంబు జేసినికొనెద వెందుకు ఇదే యీగ్రామ పశ్చిమ దిగ్భాగంబునం గల వనాంతరంబులో యాశైవదంపతు లిద్దరు అలసి సొలసి వేసారి యొక జమ్మివృక్షంబు క్రింద వసిం

చియున్నారు నీవిప్పు డచ్చటికిం బోయిన దొరుక గలరు లేనిచో తడ వైన వెళ్ళగలరు విన్నావా.

చిరు వ॥ సరి మంచిది తల్లీ నీయాజ్ఞాను సారంబుగనే నేనచ్చటికిం బోయెదను. (అని తనలో) ఆహా ఇదియేమి యాశ్చర్యము భోజన సమయంబున కీదేవాలయంబు విడచి యప్పైవ దంపతు లాకాననంబులో వసింప కారణంబేమి అయినా నేనచ్చటికిం బోయి చూచెద గాక (అని వెళ్ళి కాననంబులో శైవదంపతులం గని ప్రకాశముగా) అయ్యా శర ణదంపతులారా మీపాద పద్మంబుల కిదో ప్రణమిల్లు చున్నవాడ కటా క్షించుడు.

పర-వ॥ ఛీ దురాత్మ దూరముండుము నన్నంటకుము.

చిరు-వ॥ అయ్యా ఇంతకోప మెందుకు.

వాదము - రూపకము.

చి॥ ఇంత కోపమేల స్వామి। యిపుడు నాపై నేరమేమి। వింతగ యీసర్వభూమి। యంతదిరుగ దొరుకలేమి ॥ఇంత॥

క॥ స్వామి మీకొరకిప్పుడు ♦ గ్రామంబంతయును దిరిగి గనకు న్నను యా ♦ వ్యోమాగ్రవాణి జెప్పిన ♦ నేమముతో వస్తిమీరు నెరిసన్ని ధికి ॥

వ॥ దేవా మీకోసర మెంతో ప్రయాసపడి యెన్నోచోటుల వెద కినం గాని గాన్పించరైతిరి యిప్పు డాకాశవాణి జెప్పినందున మీసాన్ని ధ్యమునకు వచ్చితి ఇందులో నానేరమేమున్నది మీరీ కాననంబందుండ కారణంబేమి రారండు పోదము మాగృహంబునకు వంట సిద్ధమైనది.

పర॥ ఇంత మోసమా। భూకాంత నీ యుదంతము తెలిగితి ॥ఇం॥ పంతంబునసుతు నొంచియు పక్వించియు పెట్టెదనని యింతలో దప్పితి విక యిపుడెంతైనదో చూడుము మరి ॥ఇంత॥

వ॥ ఒరే కపటమానసీ యెంత మోసగాడవురా నావంటి వారల నెందరినో యిట్లే మోసపుచ్చి యుండవచ్చును యేదిరా అరణ్యంబు లో సుతునొంచి పక్వించి పెట్టెదనని నన్నెన్నోరీతుల బుజ్జగించి యిక్క యంబిచ్చితివి అదంతెందుబోయె చూడుము యెంతవేళ యైనదో.

పార్వతితో

చి॥ తల్లిచూడు నీదుభర్తా । తగనికోప మెందుకర్తా । కల్లగాదు నాదువార్తా । తెల్లముగను వినుమీ పూర్తా ॥త॥

వ॥ తల్లీ అదో చూడుము నీమనోహరుం డెంత తామస పడుచున్నాడో నేనన్నట్టులనే నాకుమారునింగోసి పక్వంబు జేసి సిద్ధపరచి మీకొరకెంతో దిరుగుచు మీజాడనే వచ్చితి ఇందులో నాతప్పితమేమున్నది.

పా॥ వల్లభుండు వృద్ధుడకటా । వలన క్షుత్తు కోర్వడకటా । మళ్ళి నీవు రాకికటటా । నురివసించి యుంటిమిచటా ॥వల్ల॥

వ॥ రాజా నావల్లభుండు పెద్దమనిషియగుట వలన నాకటికోర్వక యిట్లనుచున్నడు కావున అప్పటినుంచి నీకొరకెదిరిచూచి నీవు రాకపోవుటము వలన యిగరాడో యేమోయని నిరాశులమై యిచ్చటికి వచ్చి యిరాజమ్మనీడ వసించినారము నీవాయన నెంతో వేడికొనుము దయరాగలడు,

పరమేశ్వరునితో

చి॥ కోపముడిగి నన్ను(బ్రోవూ । కొమరు నింతలోన లావూ । రూపడంచి వండినీవూ । జూవుస్థలము కొస్తి లేవూ ॥కోప॥

వ॥ అయ్యా నా నెయ్యుకింపు పుత్రునిం గోసి పాకంబుజేసి మీరాన తిచ్చిన స్థలంబునకు వచ్చిచూడగ మీరందు లేనందున గగనవాణి యనుజ్ఞచే నిచ్చటికి వచ్చి మిమ్ముం గంటి లెండులెండు కోపగించకుడు మాయింటి విందారగించుడు.

పర॥ భూప నీవిటుల్ । మరి తేపతేప కీవిధంబునబల్ ॥భూ॥ పాపని జంపితినని పరితాపంబున బలికెద విదె । నీపొందును నీవిందును నేనొల్లను చాల్ పోపో ॥భూ॥

వ॥ రాజా నేనేమో కొడుకును జంపితినని మాటిమాటికి యిడుకుచున్నవైతే నీయిడుకుడు కూడు నాకుంబట్టదు పొమ్మా నీబంధువులు నీవు తృప్తిగా భుజించుడు.

చి॥ యేరికిత్తు నెవరుదిందూ । కీనరమాంసంబు విందూ । కోరి మీకొరకనుముందూ । నేరచించివాడ యందూ ॥ యే॥

వ॥ శైవపుంగవా మీవాంఛిత మానుకోరకు జేసిన యీనరమాంస భోజనంబు నేనెవరికి బెట్టుదు నెవరు దిందురు దయదలంచి మీరేవచ్చి భుజించి మీరుగన్నతల్లి మాన్పుకొనుడు మీకిదో నమస్కరించెదను క్షమించుడు.

పర॥ వారినా యెడల । బలుకూరిమింతో నీకు గలిగినమరి ॥వా॥ వారకనన్నెత్తుకపో వశమౌ నా కు నడవగ । చారుకుమార్ణపురీశుని సదనంబునకే దరలెద ॥వారి॥

వ॥ నరనాయకా నాయందు నీకంతప్రేమ యున్న యెడల నన్నెత్తుకొని పొమ్ము నాకైతే నడవచేతగాదు లేనిచో నేనా శ్రీశైలంబునకే పోయెదను.

చిరు-వ॥ అయ్యా మీకంటె నాకెక్కువేమున్నది రండు నా భుజంబులపై నెక్కుడు నాగృహంబునకుం దీసికొని పోయెదను (అనివంగును)

పర-వ॥ మంచిది రాజా అట్టులనే నీమీద నెక్కితిని గాని యిక్కడ నొప్పియున్నది నొప్పించక మెల్లగ నెత్తుకొనిపొమ్ము.

చిరు-వ॥ అయ్యా అలాగే నొప్పించక మెల్లగ నెత్తుకొని పోయెదను (అని యెత్తుకొని పోయి సుగ్గులాదేవితో) సతీ సుగ్గులాదేవి ఇదే శైవదంపతులం గొనివచ్చినాడ కావున యిచ్చరణాగ్రజునకి స్నానమాడించి భోజనంబు బెట్టవలయును జలంబులందిమ్ము.

సుగ్గు వ॥ నాథా అట్టులనే జలకమాడింతము యిదో నీరంబుం దెచ్చినదాన యమ్మహేశ్వరునిచ్చట గూర్చుండ బెట్టుడు.

చిరు-వ॥ మంచిది మనోహరీ అట్టులనే యీపైకి పీఠంబున గూర్చుండ బెట్టితి జలంబులుం బోయుము నేను బాగా రాచి కడిగెదను.

సు-వ॥ నాథా ఇదే పోయుచుంటిని కడుగుడు (అని నీరంబులు బోయుచు స్నానమాడించుచున్నంత)

పరమేశ్వరుడు (తనలో)

వ॥ ఆహా యీదంపతుల భక్తివిశేషంబు లెంతన వచ్చును సరి వీరికొక్క చిత్రంబు జూపించెద దాని కోపుదురో లేదో చూచెదను అదెట్టులన నామెయినిండ చీము నెత్తురు బుట్టించి యెంతకడిగిన పోకుండునట్లు చేసెదను అందుమీద వీరి భక్తి తేటపడగలదు (అని మెయినిండ చీము నెత్తురు బుట్టించియున్నంత)

చిరుతొండరాజు భార్యతో

వ॥ తరుణీ ఇదియేమి చిత్రమోకాని మనమెంత నీరుబోసి కడిగినను యీతని శరీరమునుండి చీమునెత్తురు తరుగుటయే లేదుగదా యిగ రేట్లు,

సు-వ॥ యేక్లేశమున్నది యీచీమునెత్తురు తగ్గేపర్యంతరము జలంబులుంబోసి కడుగుదము ఇంతకంటె మనకు మేలేమున్నది శివభక్తులుఖ్యుండగు యీశైవునిసేవయే మనకు మోక్షగతి (అనికడిమ్మరి)

చ॥ ఆరయగ నీమహేశ్వరుని • యందుపరంపర నీరుబోతునో
నరవర బల్ శ్రమంబనక • నందముగా మరి రాచుచుండుడీ

చిరుతొండరాజు

తరుణి మరెంత రాచినను • తజ్జల మెంతయు బోసినంగనీ
శరణుని చీము మానదెటు • సల్పుదమింక కురంగ లోచనీ॥

వ॥ తరుణీ యెన్ని జలంబులుంబోసి యెంత రాచి కడిగినను చీము నెత్తురు పోవుటయే లేదు మరిమరింత యెక్కువగనేయున్నదిగాని తక్కువ లేదు యాగరేట్లు యింతటి విచారము.

సు-వ॥ విచారమేమున్నది జలంబులుం బోసిపోసి నేను వేసారితిని కడిగి కడిగి నీవు వేసారితివి గాని కొంచెమైన చీము తగ్గుటయే లేదు ఇది యొక పెద్దపరీక్ష అయినా భయమేమున్నది ఇంకా పోసెదను కడుగుము (అని యనేకముగా శ్రమపడుచుంటు నీరుబోయుచున్నంత).

పరమేశ్వరుడు తనలో

వ॥ అబ్బా వీరెంత సాహసులు నేనెంతజేసిన నంత కోర్చుకొనుచున్నారే పాపము వీరిశ్రమ జూడజాల చీమునెత్తురు కొంత తగ్గించెదగాక (అని యట్లు జేసినంత)

చిరుతొండరాజు భార్యతో

వ॥ తరుణీ మనమీతని శరీరంబు కడగంగ కడగంగ దైవకటాక్షంబున చీమునెత్తురు తగ్గి శరీరమంత సొంపుటివలెనున్నది యికనీతనికి ధాత వేలంబునుంగట్టి శివార్చన దీర్చిన పిమ్మట యీరసమాంస భోజనంబు చేయించుము,

సు-వ॥ చిత్రము అట్టులనే సేయించెదను (అని పరమేశ్వరునితో) అయ్యా శైవాగ్రణీ ఇటులనును.

పర-వ॥ సుగ్గులాదేవి యేమి సమాచారము.

వాదము - రూపకము.

సు॥ స్వామిమీరు గోరువిధము యీమనుష్య మాంసమిందు ॥స్వా॥ నేమముగను వేరువేరు నేవడ్డన జేతు నిదో । కామిత మది శాంత దీరగామీరు భుజించుడయ్యా ॥స్వా॥

వ॥ శరణాగ్రణీ మీరుంగోరు విధంబుననే మత్పుత్రుని క్రవ్యమంత వేరువేరుగా మసాల యుక్తంబుగా పాకంబుజేసి బహురుచులు బుట్టునట్లుగా యీకనక పాత్రంబున వడ్డించినదాన మక్కువతో మెక్కి మీ మనోతృప్తిం జేసికొనుడు.

పర॥ కోమలాంగి మీదుపలన నామనోరథంబుదీరె ॥కోమ॥ ప్రేమతో నీవన్నవిధము లీమహా పాత్రింబునందు । నేమరకను వడ్డించితివా మరిలేదా తెల్పుము ॥కో॥

వ॥ సుగ్గులాదేవి నీవు వండిన పదార్థంబులెల్ల వడ్డించినవా లేదా తెల్పుము.

సు॥ శరణపుంగవా మరేమి సంశయంబు లేదుయిందూ ॥శర॥ సరసముగను జేసినట్టి పరక్రవ్య పదార్థములను । బిరుపడిగనువడ్డించితి సరమరేమి లేకకనుడీ ॥శర॥

వ॥ అయ్యా నేజేసిన పదార్థంబులన్ని వడ్డించితిని ఇందులో సంశయమేమిలేదు భుజించుడు.

పర॥ సరెను మంచి దివుతువాని శిరము చారు యేదియిందూ ॥ సరె॥ బిరబిరగ జూపించుము నేడరుదుగ నది గ్రోలుదిపుడు । మరి సర్వశరీరమునకు శిరసే ముఖ్యమని యంద్రూ ॥స॥

వ॥ సుగ్గులాదేవి సర్వస్య గాత్రస్య శిరఃప్రధానం బనునట్లు అవయవంగముల కిన్నిటికి శిరసే ప్రధానముగదా కావున ఇందులో శిరో మాంసంబుచే జేసిన చారుయేదో చూపించుము నేనదిద్రావి నామనోతృప్తిం జేసికొనియెదను దానిచేగాని నారుగ్మత మానదు.

సు॥ అన్నివిధములఁ నొనర్చినాను గాని యట్టి శిరసూ ॥అన్ని॥ మన్ననతో నొకచోటను మరి దాచితి దానిమీరు । వన్నుగ దినజాల రంచు పరమ కఠిన మంచు నెంచీ ॥అన్ని॥

వ॥ మహేశ్వరా అన్నిరకముల పొలసును అన్నివిధములుగా పక్వించితిని గాని మీరాతల పుర్రె దినుటకు శక్యంబు గాదని బహుకఠినంబుగ నుండునని యెంచి యొకచోట దాచిపెట్టితిని దాని పక్వించలేదు.

వర॥ సన్నుతాంగి మీయుపాయ సరణియేను గంటిని భళీ ॥ సన్ను॥ యెన్నుగ యేబాలునో వధియించి పీడ బాయనంచు । నెన్నితిరది కొర్గవల్లి క్రొన్నెల దాల్పేటుల మెచ్చు ॥సన్ను॥

వ॥ సరెసరె మీభక్తి యుక్తులు యేను గన్నవాడ యేదో యొక యుపాయంబు బన్ని పరశిశువు నొంచి పక్వించి పీడబాయెనని నాకువడ్డించితి రింతియే కాని వేరొండుగాదు మీకు భక్తియే యున్నయెడల మాట దప్పక పుత్రునే ఖండించి తల చారుజేసి పోయుదురు మీ రేడ మీభక్తి కూడ మీవిందు బట్టదు మీపొందు బట్టదు నేబోయెదను (అని లేచిపోవు నెడ )

సుగ్గు-వ॥ అయ్యా ఆగుడాగుడి నిజముగా కుమారునే వధించినారము గాని మీకా శిరస్సు యందే ప్రేమయున్న యెడల అట్లులనే గావించెదము ( అని భర్తతో ) నాథా ఇదియేమి యీశైవుని యుద్దేశము శిరస్సు లేదని యెన్నో విధంబుల కోపించు చున్నవాడు గదా ఇగయెట్లు.

చిరు-వ॥ మంచిది, (అని పరమేశ్వరునితో) అయ్యా మీకా శిరస్సుయందే ప్రేమయున్న యెడల యది దరిగి చారుజేయించి పోసెదను సందేహమేమి.

వర-వ॥ రాజా నిజంబుగ శిరస్సు దరిగి చారు జేయించి పోసెదవా మంచిది అట్టులనే సేయించి పోయుము.

చిరుతొండరాజు భార్యతో

వ॥ నారీ యాకుమారుని శీర్షమేదో ఇటుదెమ్ము నేదరిగి యిచ్చెదను నీవతి మధురంబుగా చారుజేయుము.

సుగ్గు-వ॥ నాథా ఇదో తెచ్చితిని దీనిం దరుగుడు నేపక్వించెదను.

చిరు-వ॥ మంచి దిటుతెమ్ము తరిగెదను ( అని తీసికొని తల దరుగ బోవుచున్నంత )

పర వ॥ రాజా ఆగుమాగుము అట్లు గాదు మీకు నాయందు భక్తి యున్న యెడల యీశిరస్సు రోటిలో బెట్టి కన్నీరు దీయకుండ మహాసంతోషములో లాలిపాట జోపాట బాడుకుంటు మీరిద్దరు ముందరనే రోకండ్లతో మర్దించి చూర్ణంబు జేసి అతిమసాల యుక్తముగా చారుజేయించి పోయుము అట్లులైన నాకు మహాసంతోషము కాగలదు.

చిరు వ॥ అయ్యా అట్టులనే జేసెదము సందేహమేమి ( అని భార్యతో ) తరుణీ యీ శైవుడుగోరు విధంబుననే సేయుదము కుమారుని శిరస్సీ రోటిలో బెట్టుము లాలిపాట జోపాట బాడుకుంటు మర్దింతము.

సు-వ॥ నాథా అట్టులనే రోటిలో నుంచిన దానను ఇదో రోకలి బట్టుకొనుడు మర్దింతము.

చిరు-వ॥ మంచి దిటుదెమ్మా. ( అని రోకలి దీసికొని )

వాదము - రేక.

చి॥ లాలీ సద్గుణజాల లాలీ సిరియాలా । సుత లాలీ సిరియాలా లాలీ సన్నుత శీల లాలీ సుతలాలీ ॥లాలీ॥

సు॥ బాలా శివలీలారత యేలా యలుకయిలా । సుతయేలా యలుకయిలా । డోలావయి నిదిరించు జోలాలగన యిలా ॥బాలా॥

చి॥ కోరీ నీపై ప్రేమలూరీ భూషణముల్ । దయలూరీ భూషణముల్ । రేరీ తెచ్చితి గైకొనుమేలా భూషణముల్ ॥లాలీ॥

సు॥ గారాబమొందవక్ సుకుమారా సువిచారా । సుకుమారా సువిచారా । రారానాతో మాటలాడాగదు ధీరా ॥బాలా॥

చి॥ సుగుణాత్మ యొకసారి నగుమోము జూపీ । నీనగుమోము జూపి । వొకసారి బల్కుమా దిగులెల్ల బాపీ ॥లాలీ॥

సు॥ జగతీ కూర్మపురీ పన్నగ రాడ్భూషణుడూ । పన్నగ రాడ్భూషణుడూ । యిగనిన్ను బ్రోచుమందు గదా వెల్లవుడూ ॥బాలా॥

చిరు-వ॥ తరుణీ మనమీ శిరస్సును దంచి చూర్ణంబునుం జేసి యీ భాండములోనిడి మసాలసమన్వితము మరగబెట్టి చారుం జేసితిమి కావున యింక తడవెందుకు యీచారు పీరికి వడ్డించుము త్రాగింపగలడు ( అని వెండియు )

వాదము - రూపకము

చి॥ నీరజేక్షణి సారసముగ యీచారును వీరికి వడ్డన జేయుము ॥ నీర॥ భూరిగ నేమును జేసిన ఘోర విమష్కృళములు నిం । పారగ నేటి తో దీరెను జేరెను కైవల్యంబును ॥నీర॥

వ॥ నాకీ యీ శైవ పుంగవున కీచారు వడ్డన జేయుము రుచులూ రంగ్రోలి తృప్తి పడగలడు అంతటితో మనము కృతార్థులము కాగలము.

సు॥ కోరిమీరనూ । తీరున వడ్డన జేసితివీరికి తలచారును మరి ॥ కోరి॥ వేరును లేక మదీయ మనోరథముం దీరగ రుచు । లూరగ శైవుని కోరిక దీరగముదమున నిప్పుడు ॥కోరి॥

వ॥ నాథా మీరను చందంబుననే యీ తలచారును యీ శైవు నకు వడ్డించిన దానను సందేహమేమి ( అని పరమేశ్వరునితో ) అయ్యా శైవపుంగవా ఇంక తడయ నెందుకు భోంచేయుడు ఇ జీచారు వడ్డన మైనది.

పర॥ మారసుందరీ మారహరుని సాక్షిగ నామది సంభ్రమ మాయ నుగని ॥మార॥ వారక నాతో నలుగురు వరుసతో భక్షించగ వలె వేరును లేకను నిటునటు వేయుము విస్తరులును మరి ॥మార॥

వ॥ అహాహా సుగ్గులా దేవి ఇప్పుడుగదా నామది సంతోషమైనది కాని నాతో నలుగురము భుజించ వలయును కావున నిక్కడక్కడ వి స్తర్లు వేయుము.

భర్తతో

సు॥ ధారుణీశ్వరా మీరలు వింటిర యీసువి చారుని శైవుని వా క్యము ॥ధారు॥ తోరముగను యీతడు తనతో నల్గురు భుజించగ । గోరి యను విస్తరు లిటునిటు గొబ్బున వేయుమటని యేను ॥ధారు॥

వ॥ నాథా ఇదెట్టివింత తనతో నల్గురు దినవలెనట విస్తర్లు వేయు మని బలిమిజేయు చున్నాడుగదా.

పరమేశ్వరునితో

చి॥ యేరినల్గురూ । సూరిజనోత్తమ దెల్పుడి మీరలెమరి మీరి ప్పుడు ॥యేరి॥ భూరిగ మీకోర్కెకై నాపుత్రుని వధియించితిమివు । డార యపరులు భుజించగ నానే యీనరకమూంసము ॥యేరి॥

వ॥ శరణాగ్రణీ మీకొరకై నాకుమారుని ఖండించి వండించితిని యిట్టి నరమాంసంబు పరులెవ్వరు భక్షింతురు యెవ్వరి కిష్టమగును అది యునుంగాక నలుగురెవ్వరు యెవ్వరికి జెడుదు.

పర॥ ధీరనీవునూ । నీరమణియు మరినేనును యీరీతిగ నొకవిధ మును ।ధీర॥ ఆరూఢిగ భక్షింతము అటుగాకున్నను నీదగు । యీరసికా న్నము లొల్లను యేగుదు కలతయు జేసియు ।ధీర॥

వ॥ రాజా అట్లయినా మీసతీపతులు నేనునుం గూడి మనము ముగ్గురము భుజింతము అట్లయిన నామది కానందం బగును అటిగాని యెడల నీభోజనంబు బట్టదు నీవుం బట్టదు ఇకంత కలతజేసి పోయెదను విన్నావా

భార్యతో

చి॥ నారి ముండటే । తీరున మూడిట వడ్డన మారూఢిగ జేయుము యిక ।నారి॥ ప్రారంభముగను నీతడు బలిమియు జేయుచు నున్నాడు । నేరము లెంచక నీతని కోరిక దీర్చగ వలయును ।నారి॥

వ॥ తరుణీ యీశైవుడు గోరిన విధంబుననే విస్తర్లువేసి మూడింట వడ్డన జేయుము యీతం డనేకముగా బలిమిజేయు చున్నాడు గదా.

సు॥ చారునిర్మలా । పేరువహించిన కూర్ణపురీ రమణుని నెరనమ్మి యు ।చారు॥ మీరువచించిన మాడ్కిని మేరయు దప్పక మూడిట । భోరున వడ్డించితినిదో జోసము శోక యుతంబుగ ।చారు॥

వ॥ నాథా మీయనుమతి విధంబుననే మూడింట వడ్డించిన దానను చూచితిరా.

చిరు-వ॥ సరి మంచిది. ( అని పరమేశ్వరునితో ) అయ్యా శరణ పుంగవా మీరను విధంబుననే మూడు విస్తరులలో వడ్డనమైనది ఇంక తడ యేనెందుకు భుజింతము రండు.

పర-వ॥ అహాహా నరవరేణ్యా ఇప్పుడుగదా నామదికి సంతోష మైనది గాని నీకుమారునిం బిలుపుము భుజింతము.

చిరు-వ॥ అయ్యా ఇదెట్టివింత నాకున్న వొక్క కుమారుని వధించి మీకొరకై పక్వించితిని ఇంకా నాకెవ్వరున్నరని పిల్తుచు నాకొక్కడే కొడుకుగదా.

పర-వ॥ ఛీ దురాత్మ గొడ్డువారింటిలో మావంటి దొడ్డవారలు భుజింప యోగ్యతగాదు అదెట్లులన.

చ॥ తనయులు లేనియిల్లు నిజ ♦ దైవము లేని మహాలయంబు స
జ్జనములు లేనియూరు రవి ♦ చంద్రులులేని నభంబు రీతిగా
ధనమును లేని లక్ష్మికడు ♦ ధాన్యము వెళ్ళని పంట యీవిధిగా
తనయులు లేని వాని యెడ ♦ తద్దయు భుక్తిని నొప్ప దెప్పుడుగా ॥

వ॥ కావున పుత్రులులేని వారియింట మావంటి పాత్రులు గుడుచుట యోగ్యంబుగాదు యెంతపని జేసితివి (అని కోపముతో)

వాదము - జుల్వ.

పర॥ సుతులులేనిదెట్లు । మమ్మికీరయమున నిట్లూ । క్షితిప విందు జేయుగ బిల్చితివిక యది యెట్లూ ॥సు॥

వ॥ ఒరె కపటమానసీ మమ్మింత మోస పుచ్చితివిరా కొడుకులు లేనిదే మాకు విందు జేతునని మమ్ముల బిలిచి మమ్మింత యవమాన పరచితివా అబ్బా నీవంటి కాటిల్యుని నే నెచ్చట జూడను గొడ్డువారింటిలో నీశ్వైన త్రాగగూడదు గదా.

రూపకము.

చి॥ సుతునికొఱకనీ హతము జేసియయూ । శైవాగ్రిగణ్యా ॥సుతు॥
హితమని పక్వించి నీవు యిడితిని పుడు నింక వేరె । సుతులు లేరటంచు నీతో కృతము జేయు చుంటియున్న ॥సుతు॥

వ॥ స్వామీ మదేక పుత్రుండగు సిరియాళుని ఖండించి మీకిప్పుడే సమర్పించితినిగదా ఇంక నాకు వేరే కుమారులెవ్వరున్నరని చెప్పుదు ఇది ముమ్మాటికి నిజంబని నమ్ముడు.

పర॥ సుతుని జంపితంచు । బల్కు తగునొరసించూ । అతని నెం దో దాచియిడితి వితరుని దినుమంచూ ॥సుతు॥

వ॥ ఒరే దుశ్శీల మాటిమాటికి కొడుకును జంపితినని వాకొనుచున్న వైతే అదికల్ల వాని నెచ్చటనో దాచిపెట్టి యెవడో యొక పరశిశువును దెక్కమానిన వానిని ఖండించి నాకొసంగితి వింతియేకాని వేరొండు గాను ఇంత మోహివగు నీవేడ నీకొడుకును జంపుజేడ.

చ॥ సతతము నీపాదసాక్షిగా । సుతునొంచినాడా ॥సత॥ ఇతర శిశువుగాదు నీకేమిపుడనమానంబుజేయ । మదిదలుచు నాడుమాట మరి యబద్ధ మిదియుగాదు ॥సత॥

వ॥ శైవపుంగవా ఇతర బాలు నెవ్వనినో వధించిపెట్టితినని యను మానించుచుంటిరా యేమి కాదు కాదు నిజంబుగ నీపాదసాక్షిగా నాకు మారునే ఖండించి పెట్టితిని ఇది సత్యమని నమ్ముము దబ్బరగాదు.

పర॥ నమ్మనీదుమాటా సుతుని నిమ్ముగ యీ పూటా । నెమ్మి బిల్వ రాకయున్న నేభుజింతునోటా ॥నమ్మ॥

వ॥ ఒరే నీమాట నమ్మజాలను యేది నీకుమారు నొక్కసారి యిందుబిల్వుము పిల్చినను రాకున్న నిజంబని నమ్మి నా కక్షిలిండ భుజిం చెదను.

చ॥ ఇమ్మహి శ్రీకూర్ణపల్లిలో । నివసించినట్టి ॥యి॥ కమ్మనిబ్బు హారులినాకు నెమ్మనమున నమ్మనీదు । నమ్మితిగను బిల్తు సుతుని నమ్మ జాల వయ్యెమాట ॥ఇ॥

వ॥ అయ్యా నేనెంతజెప్పిన నమ్మజాలకున్నవుగదా నీవన్నట్లుల నే బిలిచెదను అటుపిమ్మట శంకరుడే కలడు (అనిభార్యతో) సతీ సుగ్గులా దేవి ఇదియేమి విక్కల్పము మన చేతులార ఖండించి వండిపెట్టిన కుమారుండె ట్టుల వచ్చును యీతం జేమో పిలువుమని బలిమి జేయుచున్నాడుగదా ఇదియేమి హేతువో కాని నాకెట్లు దోచుతులేదు.

సు-వ॥ నాథా మీరిట్లు చింతించెదరెందుకు యీ శైవుని మనోసమ్మతిగనే కుమారునిం బిల్చెదను పిల్చినను రాకున్న యెడల నీతడు నిజంబని నమ్మి తానే భుజింపగలడు.

చిరు-వ॥ మంచిది పిల్వనైతే పిల్వుము.

సు-వ॥ నాథా పిల్చుచూచెదను ( అని కుమారునుద్దేశించి వేదికపై నుండి )

వాదము - యేక.

సు॥ రార సిరియాళా తనయా । తనయా । వినయా ॥ రార ॥ రార నీకొరకై శైవు డారూఢిగను మనికోరె । వేరేమియును లేక నిందూ । ఇందూ । ముందూ ॥ రార॥

వ॥ కుమారా సిరియాళా రమ్మురమ్ము నీవొకసారి వచ్చి ముఖంబు జూపుము నీరాకకై యీ శైవ పుంగవుడు నిరీక్షించుచున్నాడు గదా.

సిరియాళుడు ప్రవేశించి

వ॥ తల్లీ యేమి సెలవు.

సీ॥ కోరి సేవస్తి జననీ । జననీ । జననీ ।కోరి॥ ఏరూపిగను నీవునన్ నతివేగ బిలువగాను । కారణ మదియేమొ తెల్పూ । తెల్పూ । నిల్పూ ॥కో॥

వ॥ తల్లీ నన్నతివేగంబున రావించిన కారణంబేమో శ్రుతపర చుము.

సు॥ నీరూపు నీదూ సొగసూ । సొగసూ । వయసూ ॥నీ॥ యేరి యందున నేగాననిపుడు నీవు నాచంక జేరియొక ముద్దియివరా । యిప రా । ధీరా ॥నీ॥

వ॥ నాయనా చక్కని కుమారుండవగు నీవొక్కసారియిందువచ్చి నా యంకపీఠమ లంకరించి నాబుద్ధిదీర ముద్దియ్యవము తండ్రీ.

సిరి॥ జేతునే నీదుచంకా । చంకా । యింకా ॥జే॥ ధారుణిపూర్ణ పల్లీ ధామునా మహాదేవునీ । కోరినే భజియింతునమ్మా । అమ్మా । సునమ్మా ॥జే॥

వ॥ అమ్మా నీవను చందంబుననే నీచంకలో జేరియున్నాను కటాక్షించుము (అని అనునంతలో)

చిరుతొండరాజు తనలో

వ॥ ఆహా ఇదియేమి వికల్పము ద్రుంచబడిన కుమారుండిప్పుడు సాక్షాత్కరించుట కారణంబేమి ఇదంత దైవమాయగానున్నది అయినా నేజేసిన యుపకారమంత వ్యర్థమాయెనుగదా ( అని భార్యతో వికాశముగా ) మనోహరీ వచ్చిన కొమరుండిప్పు డెచ్చునుండి వచ్చెను మనము చేసినదంత యీశైవున కద్దంబుగా దోచునట్లాయెనుగదా.

సు॥ వ॥ నాథా నాకేమియుం దెలియదు యిప్పుడు నీదగ్గరనుండియే పిల్చితినిగదా ఇదంత యీ మహేశ్వరుని మాయయే గావచ్చును.

చిరు వ॥ యేమో (అనిసిరియాళుని కొ)కుమారా నీవిప్పు డెప్పటి నుండి వచ్చితివిరా తండ్రీ.

సిరి-వ॥ నాయనా నేనా పాఠశాలలో చదువుచుండగా మాయమ్మ బిలిచినందున వచ్చితిని ఇందుకేమి సందేహములేదు (అని అనునంతలో)

పర-వ॥ రాజా వీడెవ్వడు,

చిరు-వ॥ అయ్యా అప్పరమేశ్వరుండొసంగిన నా చిన్ని కుమారుండగు సిరియాళుడు.

పర-వ॥ అబ్బా యెంత మోసగాడవురా యెంత పని జేసితివి.

## వాదము - చెల్తి.

పర॥ ఒరేఒరే పాపిదుర్మతీ । యిత్తరింజేయు నెవరిసమ్మతీ ॥ఒ॥ బిరాన నీసుతు మరుంగు దాచియు । వరుస నెవనొామరి దరింగి పెట్టితివ॥

వ॥ ఒరే అసత్యవాది నీవేమో కొడుకును ఖండించి పెడతనని వాగ్దానమిచ్చి వాని నెచ్చటనో మరుగున దాచిపెట్టి యెవరినోమేపాపాత్ముని నో ఖండించి నాకు బెట్టితివా అబ్బా నీవెంత దుర్మార్గుడవురా నీవిట్లాటి వాడవని తెలిసిన నేరాకపోదును గదా,

చి॥ మరిణా నాదుమాట నమ్మడీ । సుతు దరింగియే యిడితి బ్రోవుడీ ॥మరిణా॥ స్మరాంతకుని సాక్షిరూఢిగనుద । బ్బరల్ గావునామొరాలకించుడి ॥మరిణా॥

వ॥ దేవా నిశ్చయంబుగ నాకుమారునే ఖండించి మీకర్పించితిని ఇందులకా శంకరుడే సాక్షి ఇది ముమ్మాటికి నిజంబని నమ్ముడు నాపై కోపలంబు జేయుదగదు.

పర॥ సరేసరే నీదుమాటలూ । దెలిసెరోరి యవి నీళ్ళమాటలూ ॥సరే॥ పరంగ బహు పాపకారి వని దె । ల్యరోరి మరిపాణిముల్ విడుతు నిదో ॥సరే॥

వ॥ ఒరే ఆత్మశ్లాఘపరాయణా నీమాటలన్ని నీళ్లమాటలే కాని వొకటైన నిజములేదు ఇటువంటి పాపాత్ముండవని నే నెరుంగనైతి ఇక నీకుమారుండు నీకు దక్కినడు ఇదే నాప్రాణంబులు విడిచెద నీకు బ్రహ్మహత్య పాతక మంటక మానదు.

చి॥ స్మరారి సమయింత కోపమూ । జేయరాదు యిదియేమి పాపమూ ॥స్మరా॥ ధరణి కార్ణపురి పురారి సాక్షిగ । త్వరగ నాసుతుని దరింగి పెట్టెద ॥స్మరా॥

వ॥ అయ్యా మీరిట్లు తామసింప వలదు వొక నిమిషంబు తాళుడు ఇదే మీరును యీసభా జనంబులంత చూచుచుండగా యిప్పుడే మత్కుమారునిం దునిమి మీకు విందుగా వించెదను తొందరేమి ( అని సిరియాలునితో ) కుమారా సిరియాలా నీమది యాహరుం దలంచుము నిన్నిపుడే మత్కర వాలంబున ఖండించి యీశైవుని మనోతృప్తిం జేసెదగాక ఇదే ఖడ్గంబు బూనినాడ.

సిరియాళుడు (తనలో)

వ॥ దేవా జగద్రక్షకా ఆపత్కాల బాంధవా ఆపన్నివారకా అనంత కోటి బ్రహ్మాండనాయకా ఆది మధ్యాంత రహిత రక్షించుమురక్షించుము ఇదే నీసాన్నిధ్యమునకు వచ్చుచున్నవాడ యీసంసార వ్యాపారంబులు నాకుం బట్టవు శంకరా పాప భయంకరా ( అని శివధ్యానంబు జేయుచున్నంత )

చిరుతొండరాజు ఖడ్గంబెత్తి

మత్తకోకిల

శ్రీమహేశ్వర భక్తవత్సల ♦ శేషభూష దయానిధే
కామసంహార లోకపాలన ♦ గజ్ఞరాద్రి ధనుర్ధరా
సోమశేఖర కృత్తివాస సు ♦ శోభి కామర వంద్యనే
సీమహీశ సుతునొంచి ♦ యిత్తును నీవుగైకొను వేగమే ॥

సంధివ॥ అని ఖడ్గబెత్తి వేసిన కంఠింబుం దెగక కుమారుని కంఠంబున పూలహారమై పడియున్నం జూచి.

చిరుతొండరాజు (తనలో)

వ॥ అహా ఇదియేమి యాశ్చర్యము కుమారుని కంఠంబుం దెగక కంఠంబున పూలహారమై పడియున్న కారణం బేమి మరలవేసెదను

( అని కత్తిబూని ) ( శ్రీమహేశ్వర భక్తవత్సల యను పాటబాడుచుం టు వేయబోవ కుష్టువ్యాధి రూపంబు మాని నిజరూపంబున )

పరమేశ్వరుండు ప్రత్యక్షంబై

రాజు కరంబుబట్టి

వ॥ ఆ ఆగుమాగుము వత్సా చిరుతొండా నీకుమారునింద్వంచ వలదు యూర్కొనుము నీభక్తి విశ్వాసంబుల కేను మెచ్చితిని గదా.

దర్వు - జుల్వ.

మెచ్చితి నీభక్తికి రాజా । వోరాజా । రవితేజా ॥ నేమెచ్చి ॥ స్వచ్ఛముగను నీదు కోర్కె లిచ్చెద వేగా । యిచ్చెద వేగా । నేవచ్చితిబాగా । వోసచ్చరిత్ర సరగనడుగు ।మెచ్చి॥ యీనాసతి నీదు భక్తి గానగ నెంచి । గానగనెంచి । యీలోన నేతెంచి । నీసూనునడుగగా నిస్తివి ॥ మెచ్చి ॥ నీకుమారు డెంచగను వివేకియు చాల । వివేకియు చాల । మరినీ కాంత యిలా । సుగుణాకరి కరుణాకరి గద ॥ మెచ్చి ॥ పొంకముగను కూర్ణపల్లి శంకరుడనునై । శంకరుడనునై । రేణాంక ధరుడనై । నీకింక వరములిత్తు నడుగు ।మెచ్చి॥

వ॥ రాజా మీముగ్గురి భక్తివిశ్వాసంబుల కేనెంతో సంతోషించి నా నిజరూపంబు జూపితిని కావున మీ కేమి వరము గావలయునో యడుగుము.

చిరు-వ॥ శంకరా పాపభయంకరా నీపాద పద్మంబులకిదో సాష్టాంగముగనమస్కరించుచున్నవాడకటాంక్షించుము దేవా మహానుభావ.

పర వ॥ రాజా చిరుతొండ మహీధవా వర్ధిల్లుము వర్ధిల్లుము.

వాదం - యేక.

చి॥ మారహరా సుకుమారా మముబ్రోవు మయ్యా ॥ మార ॥ భూరిగమాపైని కరుణబూని వరములివ్వ దలచి । కోరికతో వచ్చితివా వారిజారి ధారి శంభో ॥ మార ॥

వ॥ దేవా బ్రహ్మాదుల కగోచరుండవగు నీవిప్పుడు మాకంటికగుపడుట మద్భాగ్యంబెంతో దొడ్డది అయినా నేగోరు కోరిక లొసగగవలెనని కోరెదను.

పర॥ తోరముగాను చిరుతొండావని వరా ॥తోర॥ కోరుము నీకో రికలను కోరికతో నిచ్చువాడ । వేరులేక సర్వభూతవిభుడ ప్రభుడ జగద వనుడ ॥ తోర ॥

వ॥ వత్సా నీయభీష్టంబు లెట్టివో యడుగుము నేనిచ్చెదను.

చి॥ సంచిత ఫలదవిరించి ప్రణుతేహే ॥సంచి॥ కంచి పురాభ్యంత రమునగల జీవ సమూహములకు అంచితముగ మాకు మోక్ష మందజేయ వలయు దేవా ॥సంచి॥

వ॥ దేవా మత్పుత్రమిత్ర కళత్రాది బంధువులకు నాకు యింక యీకంచీ పురంబునం గల నరమృగ పశుపక్షి తరులతాదులకెల్ల యేడు వాడలకును మోక్షమివ్వుము ఇదియే మత్కోరిక.

ప॥ మంచిది నీరను మాడ్కి నొసంగితి ॥మంచి॥ రెంచగ శ్రీ మూర్జవల్లి యీశుడనై మద్భక్తుల । పంచ జేరి ప్రోచుచుందు పరమదయా ళుండనయ్యా ॥మంచి॥

వ॥ వత్సా చిరుతొండా నీవుంగోరు విధంబుననే మీకు మీవారికి కంచీపురంబునం గల సమస్తజీవ వితానంబులకు యేడు వాడలకు అందరికి మోక్షమిచ్చితి రండు మీరందరీ విమానంబుపై నెక్కుడు మత్కైలాసం బునకుం గొనిపోయెదను.

చిరు-వ॥ దేవా మహా ప్రసాదము.

సంధి-వ॥ ఇట్లు చిరుతొండ రాజు తన కుటుంబ సహితముగా కై లాసంబున కేగి యొక నిర్మల స్థలంబున వసించి నిత్యంబు భక్తారాధ నంబు జేయుచు సుఖంబుననుండె నంత,

మంగళహారతి – దర్వు – యేకతాళం

మంగళములు మహాదేవా । సుఖ జీవా ॥ మంగ ॥ నింగి చికుర భవ భంగసురార్చిత । గంగ ధరాచ్యుత మిత్రా । సుచరిత్రా ॥ మంగ ॥ ధవళాంగ మునీంద్ర వినుత శంభో । రవిచంద్రా నలనేత్రా । సితగాత్రా॥ మంగ ॥ శేషవిభూషణ భాషాధిపనుత । దోషమదాసుర నాశా । గిరి జేశా ॥ మంగ ॥ నతపోషణ సంచిత ఫలదమహా । సతతా నందమ

యాత్మా! పరమాత్మా ।మం॥ కోవిదనుత శ్రీ కూర్ణపల్లి ధవ । రావణమద పరిశోషా । మృదుభాషా ॥ మం౧ ॥

క॥ వరసర్వధారి సంవ । త్సర ఫాల్గుణ బహుళ దశమి సద్దినమున ంyా । చిరుతొండ నాటకము నే । విరచించితిని మహాదేవు విలసత్కారుణ్య ॥

గద్య

ఇది శ్రీ పరమేశ్వర చరణారవింద మకరంద పానానందేందిందిరాయమాన సన్మాన సుందును వాశ్రీఘ్రి శాంతాన్వయ సాగరామృత కరుండును వీరశైవ మతోద్భవుండును సిద్ధరామయ్య ప్రియ శిష్యుండును చెన్న వీరయ్య పౌత్రుండును నాగయాఖ్య లింగమాంబాగ్రి తనూభవుండును నగు గంగాధరాఖ్య కవి వర్యునిచే రచియింపబడిన చిరుతొండ నాటకము సంపూర్ణము

సర్వము

శ్రీ శివార్పణమస్తు

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ




కొండా శంకరయ్యగారి శ్రీమిజారర్ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె, సికింద్రాబాద్.

శ్రీయుత
# వైశ్యరత్న చెర్విరాల భాగయ్యగారిచే
రచియింపబడిన గ్రంథములు.

| | |
|---|---|
| సుగ్రీవ విజయము - యక్షగానము | వెల 0 - 8 - 0 |
| పుండరీక చరిత్రము - యక్షగానము | 0 - 8 - 0 |
| కనకతార చరిత్రము - యక్షగానము | 0 - 8 - 0 |
| కాంతామతి చరిత్రము - యక్షగానము | 0 - 8 - 0 |
| సత్యభామా పరిణయము - యక్షగానము | 0 - 8 - 0 |
| జయంత జయపాలము - యక్షగానము | 0 - 8 - 0 |
| శ్రీకృష్ణ రాయబారము - యక్షగానము | 0 - 8 - 0 |
| మాధవ చరిత్రము - యక్షగానము | 0 - 8 - 0 |
| కాంభోజరాజు చరిత్రము - యక్షగానము | 0 - 8 - 0 |
| మార్కండేయ విలాసము - యక్షగానము | 0 - 8 - 0 |
| భద్రసేన విలాసము - యక్షగానము | 0 - 8 - 0 |
| నాగార్జున చరిత్రము - యక్షగానము | 0 - 8 - 0 |
| గయోపాఖ్యానము - యక్షగానము | 0 - 8 - 0 |
| స్త్రీసాహసము - యక్షగానము | 0 - 8 - 0 |
| సత్య హరిశ్చంద్ర - యక్షగానము | 0 - 8 - 0 |
| సైంధవ పరాభవము - యక్షగానము | 0 - 8 - 0 |
| సారంగధర నాటకము - యక్షగానము | 0 - 8 - 0 |

త్వరలో వెలువడు గ్రంథము

| | |
|---|---|
| బబ్రువాహన చరిత్రము - యక్షగానము<br>(మషీరాబాదపై అంకితము గలది) | 0 - 8 - 0 |

వలయువారు:—

## కొండా శంకరయ్యా

పుస్తకముల వ్యాపారము,

మహాకాళివీధి సికింద్రాబాద్